# మావద్ద దొరకు వివిధ గ్రంధాలు

## వచన పురాణములు ★ వచన కావ్యములు

| వచన పురాణములు | |
|---|---|
| శివపురాణం | 5_0 |
| బ్రహ్మపురాణము | 5_0 |
| వామనపురాణము | 5_0 |
| బసవపురాణము | 4_0 |
| చెన్నబసవ పురాణము | 1_8 |
| స్కాందపురాణము | 3_0 |
| మార్కండేయపురాణము | 1_8 |
| విష్ణుపురాణము | 5_0 |
| గరుడపురాణము | 0_8 |
| బ్రహ్మోత్తరఖండం | 1_8 |
| కార్తీకపురాణము | 1_8 |
| శివరహస్యఖండం | 4_0 |
| కాశీఖండం | 2_0 |
| శివపురాణము ప॥ కా॥ | 10_0 |
| ఉత్తరరామాయణం (పద్యం) | 6_0 |
| శ్రీమదాంధ్రమహాభాగవతం | 12_0 |
| భాస్కరరామాయణం | 8_0 |
| రంగనాధరామాయణంద్విపద | 6_0 |
| శ్రీమదాంధ్ర మహాభారతం | 28_0 |
| శ్రీకృష్ణరామాయణం | 8_0 |
| బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక | 6_0 |
| భారతం | 6_0 |

| వచన కావ్యములు | |
|---|---|
| స్త్రీల వ్రతకథలు 1, 2, 3 భా॥ | 1_0 |
| పంచపాండవ వనవాసం | 1_8 |
| శ్రీరామ వనవాసం | 1_0 |
| పాండవజ్ఞాతవాసం | 1_0 |
| పట్టివిక్రమార్కులకథలు | 0_12 |
| తెనాలి రామలింగనికథలు | 2_10 |
| శ్రీనాధుని చరిత్ర | 0_12 |
| వేములవాడ భీమకవి | 0_12 |
| బమ్మెర పోతరాజు | 0_12 |
| మహాభక్తవిజయం | 1_8 |
| మహాపతివ్రతలకథలు | 1_0 |
| శుకసప్తతికథలు | 1_0 |
| పిట్టకథలు 500 పేజీలు | 4_0 |
| హాస్యకథలు | 1_0 |
| బొమ్మలరామాయణం | 1_8 |
| భోజకాళిదాసుచరిత్ర | 1_8 |
| మహాకవి కాళిదాసచరిత్ర | 1_0 |
| పన్నెండురాజులకథలు | 1_0 |
| పదునారు రాజుల కథలు | 1_0 |
| పరమానందయ్య కథలు | 1_0 |
| భగవద్గీత, బైబిల్, కురాన్ | 12_0 |
| భగవత్‌స్తుతి 1, 2, 3, 4 భా | 1_0 |




:- ప్రాప్తిస్థానము :-

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో, : : రాజమహేంద్రవరము.

# మగపిశాచం

## నిరూపకనవల

రచయిత

యస్. శ్రీరామమూర్తి

ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,

సంస్కృతాంధ్ర బుక్ డిపో, (స్థాపితం 1882) రాజమండ్రి.

# మృగపిశాచం

## ౧

“ఇది ప్రథమ ప్రయత్నముగాదు—దుర్భరము—అవస్థ—వసంతకు పాపము గోపీచంద్—ప్రవాసము—ఈపని నెరవేరదా—కాకేమి—కాకున్నది కాకమానదు—ప్రతాపము—విజృంభణము—దుస్సహము—దురవగాహము—నేనింతవరకు కనివిని యెరుంగనిది—సాహస చర్య—కత్తిరాకలు—నల్లదుస్తులు—పాతాళ దుర్గములు—నిబిడాంధకారములు—భయంకర సమావేశములు—యెత్తుపై యెత్తులు—కన్నుగానుపడని మోహాంధకారము—ధనాపేక్ష—నిర్జరారణ్య ప్రదేశము—భూరికంటక శిలాభూయిష్ఠము—దుర్గశిలాగాఢ ప్రణయవ్యథలు—హత్యా పాతకములు—భయంకర రక్తపాతములు—స్వప్రయత్నములు—పరస్పరాలోచనలు—తప్పక—ముగియు పను వీరాలాపము—అత్యద్భుతాపరాధ పరిశోధకుల ప్రక్కలోనిబల్లెము. న్యాయాన్యాయ ప్రవర్తకులపాలిటి మృత్యుదేవత—దుండగీడులగు జారచోరులకును, చోరశిఖామణులకును మొనగాడు—ధనవంతుల ప్రాణంబుల గడగడ లాడించి ధనాగారంబుల కొల్లగొట్టగల ధైర్యశాలి—దయార్ద్రహృదయులగు అబలాజనంబుల సయితము హింసించి, వేధించి తన దురక్తాక్త శకటమున నడిపించగల సాహస చక్రవర్తి—దుర్గసాధనము—సాధారణ మానవుల జజేయము—నిర్మానుష్యపథము—సాధన మత్యవసరము—నిశ్చయము—తప్పదు—జరిగి తీరవలెను—నా ప్రతాపంబు తరుణము—”

ఈ విధముగా సాంకేతికాక్షర పదములతో యిరువురు పురుషులు మాట్లాడుకొనుచు నడువదొడంగిరి.

... ... ... ... ... ...

మానవ హృదయములందు దురహంకారములు, దుర్బుద్ధులు, దురాలోచనలు లేనియెడల యీ భూలోకము స్వర్లోకమువలెనె ప్రకాశమానమయి యుండవలసినది. కాలానుసారణముబట్టి మానవ దిశలు బ్రహ్మలిపిలో వ్రాయబడియున్నవి. సుఖసంపాదనార్థము యీ మానవుడెంత ప్రయత్నించినను నయ్యది యీశ్వరేచ్ఛ ననుసరించి తారుమారగుచుండును. ఒక్కొక్కప్పుడు సఫలీకృత మవుచుండును. భూమి సంపూర్ణముగా ఫలమునొంది సస్యసమృద్ధితో ప్రకాశమానమై యొప్పుచున్నప్పుడు కర్షకుడు తన కష్టఫల మీడేరెనని కుతూహలుడై దాని నెల్లయిన వేసడములపై భద్రముగా యిల్లుజేర్ప యత్నించుచుండ, యేటివరద దానినంతయు బూడిని బూర్చి వానిని విఫలమనోరథుం చేయుచున్నది.

నూవుగింజలో జీవయాత్ర గడపువాని పగిదినేగదా వర్తక వ్యాపారమునకై బహుదూరదేశమేగిన వణిజుండు విశేష ధనసంపాదనముచే సంతోషమువొంది, దారాపుత్రాదుల చూడదలంచి గంపంత యాసతో యింటి కేతెంచునప్పుడు మార్గమధ్యమున తస్కరాపహృతధనుండయి ప్రాణముల సయితము గోలుపోయు మనోవల్లభుని రాకకై నిరీక్షించుక నున్న భార్యాపుత్రాదుల కాశాభంగము కలిగించునదియు దైవేచ్ఛయేగదా ?"

అని సంభాషించుకొనుచు యిరువురు పురుషులు మోగుల వేషముతో గోపాలపురము దాటి మరుచటి దినంబునకే మరల నియమిత స్థలము చేరవలెనను యాలోచన మంకురింప యా నిర్జరారణ్యమార్గమునుండి యతిశీఘ్ర గమనముతో ప్రయాణము సల్పుచుండిరి.

ఆ యడవి మానవమాత్రులు నడచుటకు సాధ్యమైనదిగాదు. వారు పోవు దారి యొక దుర్గసామీప్య ప్రదేశము. అంతయుఁ క్రూర జంతు సముదాయము. పవలే యీ నట్టడవియందు గాఢాంధకార మయముగ నుండును. ఇక రాత్రులసంగతి వేరుగ వర్ణింపవలయునా? గగనమండలము నొరయుచున్న పర్వతపంక్తిచే నావృతంబయిన యీ వన్య ప్రదేశ మంతయు నగమ్య దుర్గమార్గమువలె మన యీ బాటసారులకు గానబడుచుండెను.

అయ్యది శీతకాలము. శీతకరుడు తన కిరణాల నన్నింటిని నా దుర్గసామీప్యమున వెదజల్లుచుండెనో యనునట్లు రాళ్లపై యంతయు మంచే. ఆనాటి చలికి పక్షిజాలంబులును, సింహ, శరభ-శార్దూలాది భయంకర క్రూరజంతు సముదాయమును సయితము దడిసి యెక్కడ యొదిగి యుండెనోగాని వాటి ధ్వనులే గానరావు. ఆ మంచమంతయు రాళ్లపైనుండి కరగి చిన్నచిన్న ప్రవాహములుగ ప్రవహించుచుండెను.

ఆ యడవిలో బాటసారు లెవ్వరును నొంటరిగా ప్రయాణము చేయరు. ఒకవేళ ప్రయాణము సలుప తప్పని పనియయిన గుంపులు, గుంపులుగా తప్ప యన్యవిధముగా నడచువారా నిర్మానుష్య పథంబునం దరుదు. ఈ నడచుచున్న తెరువరు లిరువురు చలికి బాగుగా తడసి యుండిరి. వారు బాగుగ దృఢగాత్రులును నవ వయస్కులును యగుటవల్ల తీవ్రగమనమున నే నడచుచుండిరి. వారి ముఖవర్చస్సు తళతళ లీనుచుండెను. వారిరువురును ముప్పదివత్సరముల లోపు వయస్సు గలవారు. వారు చెంగావిరంగు దీర్ఘకంచుకముల ధరించిరి. వారి కంఠమున రుద్రాక్షమాలలు వారి కొకవిధమయిన విసువు గలిగించు చుండెను. వారు తలలకు తలపాగల జుట్టిరి. వారు ధరించిన కావి దుస్తులును, చంకనున్న కక్షపాలయు, చేతనున్న యోగదండమును తిలకించిన వారు నిజముగా యోగులనియే భావింతురు.

అప్పటికింకను సూర్యోదయమునకు కొంత వ్యవధి యున్నందున కారుకమ్మిన మొగిలలువలె మంచు దట్టముగా వ్యాపించి యీ తెరువరు లకు కొంత సంకటమును గలిగించుచుండెను. కొంత సేపటికి నృదయ భానుడు నిజకిరణ ప్రసాదంబున భూనభోంత రాళంబుల ప్రతిఫలించుట చే యా మంచయంతయు విరిసి యీ మార్గస్థులకు నూతనోల్లాసమును గలిగించుచుండెను. వారిరువురు వారిలో వారు సాంకేతాక్షరములతో ప్రసంగించుచుండిరి.

ఒకడు :—దుర్గము—క్రూరచర్యలు—నటనా సామర్థ్యము—యెరుగనిదా ?

వేరొకడు :—కష్టము—గోపీచం—విడుదల—విశీచి పుచ్చుట యెనా—మార్గము - కొండలు—నిర్గమము—స్వేచ్ఛ—విచారము బాపుట—అత్యవసరము—నిశ్చయము—ధైర్యము—కానున్నదో ?

ఒకడు :—కాకేమి—తప్పక విడుదల—జయము—నిరాటంకము—అనుచు వారు యెంతో ప్రయాసతో పాదముల మెదలించుచు చివరకు మిక్కిలి వడిదుడుకుగానున్న నొక్క లోయం ప్రవేశించిరి. ఆ లోయలో నడచినడచి యతి జాగ్రతతో నొక కొండ నెక్కిరి. అచ్చట ఛేదింపబడిన తరుశాఖలగాంచి కొంత తడవు యాలోచించి యక్కడ నొక దారి వక్రమై యున్నందున మరల పూర్వభాగమునకు బోయి తరువాత క్రిందకు అగాధమువలె, సొరంగమువలెనున్న పాతాళ ప్రదేశమునకు చిన్నచిన్న యడుగుజాడలగుండా నడువదొడంగిరి.

ఆ యగాధమంతయు గాఢాంధకార మయము. వారా యగాధములో ప్రయాణము సలుపవలసి యున్నది. ఆ మార్గస్థులు యా యగాధమునందు నిలిచి యెటుబోవుటకును తోచక దిగులుచెందిరి. అన్యమార్గ మేమియు లేనందునను, యక్కడే యొక చిన్న యడుగుజాడ

కానుపించుటవలనను వారిరువురును ధైర్యమువహించి, కార్యసాధనము నిమిత్తము కరకురాళ్లు తాకుడునకు పాదములు తిమ్మెర లెక్కుచున్నను, సరకుచేయక నిర్భయముగా నడువదొడంగిరి.

అట్లు వారు రెండుగంటల కాలము ప్రయాణము జేసిన తరువాత మరల నచట నొక కొండ కానుపించెను. వారు యదియే పర్వతపాతాళ దుర్గముని యూహించిరి. వారా కొండప్రక్కనే యున్న లోయగుండా పోదొడంగిరి. ఆ లోయ చాలా యిరుకయినది. అచట కొద్ది వెల్తురెచ్చటినుండియో యగపడుచుండెను. ఆ పాతాళ దుర్గమునకు అయిదారు చోట్ల శిఖరములు గలవు. వారా దుర్గనిర్మాణ చాతురీధురణతకు యచ్చెరువందుచు రెండువందల గజములదూర మేగునప్పటికి యచ్చట యినుపమేకులతో బిగించబడిన కొయ్యతలుపుల ద్వారమొకటి కానుపించెను. ఇంక ద్వారము దాటి యెక్కడకు పోవలెనో వారి కేమియు తెలియదు. వారా ద్వారమును బాగుగా పరిశీలించిరి వారు యిట్లు మాట్లాడుకొనిరి.

మొదటివాడు:—మిత్రమా! ఇదియే హంతకుల పాతాళదుర్గము

రెండవ: —అవును. ఎంత భయంకరముగ నున్నది.

అనుకొనుచు యా తెరువరు లిరువురు ద్వారమును పరిశీలించగా నచట నొక తీగ వారికాళ్ళకు తగిలెను. ఆ తీగను యిరువురు వారి శక్తిసామర్థ్యములు వినియోగించి గట్టిగా లాగిరి. వెంటనే యాకస్మికముగా యా ద్వారమునందున్న చిన్న తలుపు తెరువబడెను. తోడనే వీరు నాశ్చర్య చకితులయిరి. లోనుంచి నొక దీనారవము వీరి శ్రోత్రేంద్రియముల సోకెను.

“ ఓ పుణ్యాత్ములారా ! నేను యెనిమిది దినములనుండి యీ గుహాంతరాళంబున కడు బాధపడుచుంటిని. నన్ను రక్షింప నేతెంచిన మహామహులుగా తలంచుచున్నాను. ”

వారలా మాటలువిని "మిత్రమా! ఈతఁడే గోపీచంద్ కావచ్చును. లోనికిపోయి చూతము" అని యా చిన్నితలుపుగుండా లోపలికిపోయిరి. లోన యా విచారించుచున్న పురుషునిజూచి తలనూచి "మామా గోపీచంద్! నేను రామసింగును. ఈతను నా మిత్రుఁడు కేశవరావు. నిన్ను విడిపించునిమిత్తము మేము బహు బాటులు బొంది యియ్యెడకు వచ్చితిమి. మనము శీఘ్రకాలమున పోవలయును" అని పలుకరించెను.

గోపీ:— కేశవ రామసింగులారా! నేను కడు ధన్యుఁడను. మీ రాక తెలిసినచో ముప్పు వాటిల్లగలదు. మీ యోగివేషములగాంచి నే నెవ్వరో యోగులనియే భావించితిని ముందు నా యీ బంధముల సడలించుము.

వెంటనే వారు గోపీచందు బంధముల త్రెంపివేసి మరల గుమ్మము వద్దకు వచ్చి నిల్చిరి. తక్షణమే యా ద్వారమునకు వెనుకప్రక్కను పెద్ద చప్పుడయ్యెను గోపీచందు యా ధ్వనివిని యేదో మరల ముప్పు వాటిల్లినదని తలంచెను రామసింగు కేశవులు దుస్తులలోనుంచి రివాల్వరులు దీసి సిద్ధముగానుండిరి.

మరికొంతసేపటికి యా ద్వారవు తలుపు పయికిపోయి యక్కడ నొక కాళీ యేర్పడెను. వెంటనే యందుండి యాకస్మికముగా యిరువురు భటులు యాయుధపాణులై లోనప్రవేశించి రామసింగు, కేశవరావులపై బడిరి. వీరును భీతినొందక రివాల్వరు గుండ్లను ఢాంఢాం యని ప్రేల్చిరి. ప్రేల్పులతో యా యిద్దరు భటులు క్రింద పడిపోయిరి.

ఈ చప్పుడు విని లోపలనుంచి మరల వొక పెద్ద కలకలము విననయ్యెను. ఆ చప్పుడు విని హంతకుల సైన్యమంతయు వచ్చుచున్నారని రామసింగు గ్రహించి ద్వారము ముందునకు వచ్చి యా యినుపకవాటమును మూసివేసి యా తీగను మరల నెప్పటియట్లు

లోయలో ప్రవేశించిరి. అప్పుడు రామసింగు ఆ తలుపు బయటనుంచి గాని తెరువ వలనుపడదు కాబోలు. లేకున్న వారందరును మనపై నీ పాటికి పడియేయుందురు. అని తలపోసి గోపీచందు కేశవరావులతో గూడ వచ్చినదారినే యథేచ్ఛగా నిర్గమించిరి.



అత్యుదాది శరత్కాల పున్నమం దొకనాటి రేయి. సుధాకర దివ్య వినీల కాంతులు ప్రతిఫలింప, మలయమారుతుడు దవ్వు దవ్వుల నుండి వీచుచుండ గౌతమీ ప్రవాహము గర్వించి పారజొచ్చెను. ఆ నిశాకరుడు తన లేత కిరణముల ప్రసారము దీప్తతారకా నిచయ పంక్తిపై బ్రసరింపజేసి, నరసింహేంద్ర పురమునకు నూతనశోభ గల్పించుచుండెను.

ఆనాటి రోజులలో సకల సంపదలకు, ధనధాన్యాదులకు పుట్టినిల్లయినట్లు నరసింహేంద్ర పురమున కెక్కుడు ప్రతీతి. ఆ పుర రాజమున కింత శోభగలుగుటకు కారణ మందుండు శిల్పులు మొదలగువారి కట్టడములే తార్కాణము. ఆ వెన్నెల రేయియందు రేరాజు తన కడ్డమువచ్చిన మేఘపటలిని చివాలున ఛేదించుకొని బయల్వెడలుచుండెను. ప్రకృతి యంతయు శృంగార మయమయి, పదునారు కళలచే వెలుగొందు చున్నట్లు చూపరులకు గానబడు చుండెను.

జనార్ధనరావు నివసించునదియు ఆ నరసింహేంద్ర పురిమే. ఆతడు గోదావరీ తీరమందున్న పుష్పవనములో విశాల భవనము నిర్మించుకొని నివాసము చేయుచుండెను. ఆ వనములోనుండి పరిమళ

మిళితలు మార్గస్థులకును యీ మనోజ్ఞ మందిరమందు నివాస మొనర్చి వారికిని ఘ్రాణేంద్రియముల విందొనర్చుచుండెను. ఆ వనమందు నానావిధ ఫలపుష్ప జాతులు గలవు. ఒకవైపున రోజా, చామంతి, గులాబి మొదలగు సువాసన వాసనలతో వెలుగొందు పరిమళ మిళితములు, వేరొక ప్రక్క బత్తాయి, నారింజ, పనస, రామాఫలములు సపోటా మొదలగు ఫలజాతులు గలవు.

ఆ వనమున కుత్తరభాగమున నొక రాతితిన్నె గలదు. అది యిరువది మనుష్యులు కూర్చుండుటకు వీలయినది. ప్రదోషకాలము కాగానే జనార్దనరావు తన నేస్తగాండ్రతో గలసి దానిపై విశ్రమించుటో లేక ప్రక్కనేయున్న గోదావరీ ప్రవాహ సంజనిత తరంగంబుల కన్నుల పండువగా తిలకించుట యందుననో కాలము గడుపుచుండును. రక్షకభట శాఖలో పోలీసు సూపరిండెంటు పదవి జనార్దనరావున కిచ్చుటచే నాతడు పవలంతయు కర్మాగారమునందుననే పనిచేయుచుండును. ఈతడు యంత పొడగరిగాడు. వయస్సు ముప్పది యయిదు వత్సరములు మించియుండును. ఎర్రనివాడు. సామాన్య బలశాలి. వారి పూర్వులు గడించిన యాస్తియంతయు యప్పుల క్రింద వానితండ్రి ఖర్చుజేసెను. ఇప్పుడు జనార్దనరావువద్ద తండ్రి ఖర్చు చేయగా మిగిలిన పన్నెండువేల రూప్యముల రొక్కము నిలువయే. ఆ డబ్బుసంగతి యింతవరకు యెవ్వరికిని తెలియదు.

జనార్దనుడు తన స్వశక్తిచే విశేషధన మార్జించి యీ నిర్మల భవనమును నిర్మించెను. ఈయన కెవ్వరును మగపిల్లలు లేరు. ఒకచిన్న యాడుపిల్ల. సుమారు మూడుసంవత్సరముల బాలిక గలదు. ఆ బాలిక నెప్పుడును యెత్తుకొని యాటలాడించుటకు నొక దాసిని ప్రత్యేకించి నెలకు పండ్రెండు రూప్యము లిచ్చుటకు కుదిర్చిరి. ఇప్పటికా దాసివచ్చి నాలుగు మాసములు పూర్తికాలేదు. ఈమె చాల మంచిమనిషి.

యజమానియందు వాత్సల్యము గలది. ఆ కుఱ్ఱదా న్నెత్తుకొనుచు నేపని లేనప్పుడు తగినంత పని కల్పించుకొని యే పూటద్దములో కుట్టుచు యా బాలిక తన బాలికగా ప్రేమించుచు కాలక్షేపము జేయుచుండెను.

ఈమె నివాసస్థలము కాళీపట్నము. ఈమె బంధువులకును నీమెకు బద్ధవైరము. ఆ కారణమున యీమె స్వగృహము విడచి పలాయితురాలు కావలసివచ్చెను. ఈమెకును యీమె యా ప్తబంధువులకును విరోధము గలుగుటకు కారణ మేమయియుండును? బాంధవ్యుల క్రూరచర్యలే యని మన మూహింపవలసి యున్నది.

... ... ... ... ... ...

నా·జ :—మాధవరావూ! నేడు మన ప్రియమిత్రుడు రామసింగు యేమయినాడు.

మాధ :—ఏమో. నిన్ననె వొక గుఱ్ఱముపై యెచ్చటికో పయనమైనాడు. నే నడుగగా మరలవచ్చి చెప్పెదననియు, గోపీచందు విడుదలకై వొక రహస్యస్థలమును సాధించుటకై పోవుచుంటిననియు జెప్పెను.

జనా :—కాని యాత డూరలేని సమయమున నా మనం బేలాగోయుండును. కాని మరల యీ పూరునందు హత్యలు జరుగుచున్నవని వినికిడి.

మాధ :—ఔను. ఏమైనను మన కేమిభయము. మొన్న యీ పూరిచివర తోడలో నొక స్త్రీశవము దొరికినదట. ఆమెపై బలవన్మరణ చిహ్నములన్నియు నగపడుచున్నవి. ఆమె యెవ్వరో తెలిసికొనుట దుస్సాధ్యమైయున్నది.

జనా :—నేనును మరచితినిగదా! నాగోసమై కర్మాగారమున కెవ్వరును రాలేదు.

ఇట్లు కొంతసేపు సంభాషించి చివరకు జనార్దనుడు మాధవ
రావును పంపి తాను నిదురించుటకు లోనికేగెను.

... ... ... ... ... ...

జాగ్రత జాగ్రత్త! కాలిచప్పుడు వినవచ్చెనేని మోసము
వాటిల్లును. నీ కృపాణమునుగూడ నా చేతికిచ్చి నీవు ముందా చావడి
తలుపుతీసి ఆ నళినిపని పట్టుము. దుర్ముఖా తెలిసినదా? నేను మేడపైకి
బోయి మన పండ్రెండువేల రూప్యములకై ప్రయత్నించెదను, నీవు
కడు యప్రమత్తుడవయి చరించుము.

అనుచు నల్లని వ్యక్తులు యిద్దరు భయంకరాకారులు నున
జనార్దనరావు నిర్మల సౌధమున ప్రవేశించిరి. చేతులందు తళతళలీను
కృపాణములు ధరించిరి. అందొకవ్యక్తి తిన్నగా చావడీ ద్వారము
నయిపువచ్చి నళిని పండుకొన్న మంచమువద్ద నిలిచెను.

ఆరాత్రి నిజముగా అతి భయానకమగు రాత్రి. ఆ వ్యక్తి
"ఆలస్యం అమృతం విషమ్" ను నార్యోక్తి జ్ఞప్తికి తెచ్చుకొని
తటాలున తన కత్తితో నొక్కపోటు మన దాని గుండెలలో పొడిచెను.
మాటాడుటైన వీలులేకుండునట్లు గట్టిగా మెడను నదిమిపట్టెను.
పాపము నళినీబాయి హత్య సమాప్తము. ఇక రెండవవ్యక్తి మేడపైకి
బోయి గదియంతయు పరిశీలించుచుండ యీ మొదటివాడు గూడ
నచటికి వెళ్లి మిత్రమా! పని ముగిసినదిసుమా యనెను. అతడును
తల పంకించి మెల్లగా యినుపపెట్టెవద్దకు పోయి దానిని బలవంతముగా
బ్రద్దలుగొట్టి విద్యుద్దీపముచే పండ్రెండువేల రూప్యములను పట్టుకొనిరి.
ఆహా యెంత సాహసము.

ఒకడు :— ఓ దుర్ముఖా! మన పని పూర్తిగావచ్చినది. ఇంకను
యేమున్నవో వెతకుము.

దుర్మ:— ఇదిగో రివాల్వరు. ఈ దెబ్బతో జనార్దనరావుపని సరి. అనుచు వారు త్రాటి సహాయమున మేడపై యంతస్తునుండి యిరువురు మామిడి తోపులోనికి జారిరి.

... ... ... ... ... ...

తెలతెల వారుచుండెను. పక్షిగణంబులు కిలకిలారావంబులు వెడలగ్రక్కుచు నియత కులాయనంబుల విడిచి యెందెందో బారు చుండె జనార్దనరావు నిదుర మేల్కాంచి కాలోచిత కృత్యంబులు దీర్చుకొనుటకు వెళ్లుచుండగా యొక పురుషుడు వచ్చి "అయ్యా! జనార్దనరావుగారూ యేమున్నది యేమున్నది. హత్య ఘోరహత్య" యనుచు గోలుగోలున యేడ్చుచు పిడుగువంటి వార్త చెవినివేసెను. తక్షణమే జనార్దనరావు నిలువున నీరయిపోయెను. గబగబ చావడిలోనికి పోవుసరికప్పుడే యింటినిండ జన సమూహము నిండియుండెను.

వారందరును గొల్లుమనుచుండిరి. జనార్దనరావు తిన్నగా ద్వారము వైపునకు వెళ్లి ఆ రక్తము జూచి చకితుడై పోయెను. నోట మాటలేదు. కొంతవడికి తెలివి దెచ్చుకొని యా మంచమువద్దకు పోయి చూచెను. అంతయు రక్తమయము. నళిని హత్య.

అప్పటికప్పుడే నరసింహేంద్ర పురమంతయు యీ దుర్మరణ వార్త వ్యాపించెను. "అయ్యో పోలీసు సూపరింటెంటు భవనముననే హత్యయట. నళినిని యెవ్వరో చంపిరట" అనుచు ప్రతి వీధినుంచి జనసమూహము చిందరవందరగా వచ్చి జనార్దనరావు భవనము చుట్టుముట్టిరి. వెంటనే జనార్దనుడు సేవకుని బిలచి "ఓరీ నీవువెళ్లి మన మాధవరావును తీసుకొని రమ్ము" నెను.

వెంటనే సేవకుడు మాధవరావు యింటికేగి "అయ్యా! సబు యినస్పెక్టరుగారున్నారా" యని యడిగెను. అప్పుడు లోపలినుంచి యొక దృఢశరీరుడు వచ్చి "ఏమి విశేషము" అని యడిగెను.

"అయ్యా! జనార్దనరావుగారింట హత్య జరిగినది. మిమ్ముల నతి త్వరితముగ తీసుకురమ్మనినారు" అని జెప్పెను. చదువరులారా! ఈ సబుయిన స్పెక్టరే మన మాధవరావు

మాధవరావు లోనికేగి దుస్తులు ధరించి, పిస్టలు తీసుకొని బయలుదేరి సేవకునితోగూడ జనార్దనరావింట ప్రవేశించెను. "జనార్దనా! యెంతపని జరిగినది. దైవము పగవాడైయుండ మన మెన్ని కట్టుబాట్లు జేసినను నిష్ఫలమేగదా? ఇంతటి ఘోరహత్య యెన్నడైన జరిగినదా? ఈ సమయమున రామసింగు యున్న యెంతయు బాగుండెడిది. వాడూరలేని సమయము నిరీక్షించి హంతకుడీ పని జేసెను. ఈ హంతకు డెవ్వడో యతి భయంకరుడే కానిమ్ము విచారించిన ప్రయోజనము లేదు" అని యూరడించి యిరువురును గలసి మంచమంతయు పరీక్షించిరి.

తరువాత జనార్దనుడు "మాధవా! నా ధనమంతయు మేడపై నున్నది. దానికేమి ప్రమాదము రాదుగదా? ఏమో హత్య గావించినవాడు యూరకపోవునా? మనము త్వరితముగా పోయి చూచుటే మంచిది నడువు" మని యిరువురును గలసి గదిలోకి బోయి మేడనుయెక్కి యినుపపెట్టెయున్న స్థలమునకు పోయి జూచిరి. అయ్యది తెరువబడియుండెను. ఆహా! నా ధనమంతయు దొంగిలింపబడినదిగదా. యని చిత్రప్రతిమవలె నిలువబడిపోయెను.

జనార్దనా! విచారించిన ఫలమున్నదా! ఏమిచేయుదుము అని యిరువురు పెట్టెనంతయు పరిశీలించిరి. అందేమియు చిల్లిగవ్వ లేదు. వారి కందొక కాగితము దొరికినది. దానినీ క్రిందివిధముగా మాధవరావు చదువ నారంభించెను.

రామసింగు మిత్రుడగు జనార్ధనరావుకు—

నీవేమో మిక్కిలి విఱవీగుచున్నావు. రామసింగు పరాక్రమవంతుడు నీ ప్రక్క నున్నాడని నీకు గర్వము మెండు. నీ గర్వము నణంచుటకు పలువిధంబుల ప్రయత్నించితిని. అదియిప్పటికి ఫలించె. పిశాచబలగ నాయకుడన్న యేమనుకొంటివో? యిప్పటికయిన నా ప్రతాపము తెలిసినదా? జాగ్రత్త! నాకోసము యిక్కట్టు పెక్కుకష్టంబుల డీకొనకుము. మీ ప్రాణరక్షణో పాయంబునకు తెర వూహించుకొనుడు. వలదని రామసింగునకు నీ మిత్రులకు వుద్బోధించుము.

ఇట్లు,
పిశాచబలగనాయకుడు.

వారా యుత్తరమును చదివి తల పంకించి వేడినిట్టూర్పు విడిచి పెట్టిరి. ఎప్పటికయిన నా యంతకుని పట్టుకొనవలయును. మన రామసింగు రాగానే యీ యుత్తరము వానికిమ్ము. రామసింగు వానినితప్పక నురుమాడగలడుఁ మన మందరము వానికి సయిదోడుగా నుందుము.

జనా :—పండ్రెండు వేల రూప్యములు దొంగిలించినాడు. కాని దాసిని హత్యచేయుట యెందులకయి యుండునో. నాకు నొక యనుమానముగలదు. అది నా ద్వారము గావలిగాయు సేవకునిపయి యున్నది.

మాధ :—రామసింగు వచ్చినతరువాత వానిని పిలచి యనుమానము దీర్చికొనవచ్చును. నీవు యేమీ విచారించకుము. ధయిర్యమవలంభించుము. కర్మాగారమునకు వేళయినది. పోవుదము. అని యిరువురు వెడలిపోయిరి.

## 3

ప్రణయారాధనా తత్పరయై వసంత తన దివ్యసుందర విగ్రహాన్ని మేలిముసుంగులో గప్పివేసి యొకనాటి ప్రశాంత సమయమున మదనవేదనా భరము సహింపజాలక విస్పృహతో నొక శిలావేదిపై నధిష్ఠించి తన ప్రేమధనమునుం జోరగొను ప్రియునికొరకై నిరీక్షించుచుండెను. ఆమె హృదయమున నేదో వింత వికార ముదయించెను.

ఆమె కుంతలములు నిగనిగ మెరయుచు నీలకాంతులచే సోగగా గన్పట్టుచుండెను. ఆమె ముద్దుమొగము ప్రకాశమానమై యుండెను. ఆ మనోహరి తనులతలయందు లావణ్య తేజము కన్నుల మిరుమిట్లు గొల్పునట్లుండెను. ఆయమ నేత్రంబులు యాకర్ణాంతములై, వికత పూదళములవలె మనోహరములు. ఆమె నాసిక సుందరమై సముదీర్ఘమై యమూల్య మౌక్తికాగ్రమణివలె యొప్పుచుండెను. ఆమె హస్తముల యందలి కరకంకణములు తీయందమునుగూడ మరపించుచుండెను. ఆమె వయస్సు పదునెనిమిది వత్సరములు. నవయవ్వన సురూప లావణ్య కళాలలితాంగి. ప్రియధనంబు కొరకై మనోవ్యథజెందుచు తాపభారము సలుపుచు మనోహరునికై యెదురు తెన్నులు గాయుచుండె.

ఆహా! పడుచుల మనోకారములు యెంత నిగూఢములైనవి. ఆమె గూర్చుండినదియు నొక యుద్యానవనమే. మలయ సమీరుడు మారుత ప్రకరణంబును వదలి పెన్నెరులను పాయలుగా మార్చి చిక్కబర్చుచు జీరాటము గలిగించుచుండెను.

మన వసంత వేడినిట్టూర్పులచే మొడలంతయు తడిసిపోయెను. మన్మహోకాంతు డెంతకును రాకున్నా డేమొకో యని విలపించుచు గూర్చునియుండెను.

ఆమె నయనములకు నొక యోగి విగ్రహము కానుపించెను. ఆమె నిజముగా యోగియే హరినామ స్మరణము జేసికొని వచ్చుచుండె నని నిర్ధారణము జేసికొనియెను. దూరమునుండియే అయ్యా మీ రెవరని ! ప్రశ్నించెను.

యోగి :—అబలా ! ఏమిట్లు విపరీత చేతస్కురాలవయి కుందుచున్నట్లున్నావు.

వసంత :—అయ్యా నన్నొద్ధరింప స్వర్గమునుండ వచ్చిన భాగ్య దేవతవలె గన్పట్టుచున్నారు. నా మనస్సొక దివ్యమంగళ విగ్రహము పయి పోయియున్నది. మీరు యతీంద్రులని మీకు తెలియని విషయ మొందు లేదని మిమ్ములన డిగితిని. ఈనా కోరిక నాతండ్రి కయిష్టము నా తండ్రి యభిప్రాయము వేరు నా యభిప్రాయము వేరగుటబట్టి నేనిట్లు కృశించిపోవుచుంటిని. నా తండ్రికి నాపయి మరొక క్రోధము నావంతయు లేదు. కాన నా జీవిత మెట్లు ఫలించునో తెలియవేడెదను.

యోగి :—అతివా నీ తండ్రి నీ తండ్రి పేరేమి ?

వసం :—నా తండ్రిగారి పేరు గోపీచందు.

యోగి :—మీవా రెన్ని నిర్బంధములు పెట్టినను నీ కోరిక నీవు తప్పక సఫల మొనర్చుకొనగలవు. నీ కోరిక ఫలించగలదు. కాని కొంత కాల మోపికబట్టవలెను. అనివొక తీగెల పొదవద్దనుండి చాటునకు పోయి మటుమాయ మయ్యెను.

పాఠక మహాశయులారా ! ఈ యోగి యెవ్వరో మీకు మున్ముందు తెలియగలదు.

... ... ... ... ... ...

వసంత తండ్రిపేరు గోపీచందు యని మీ కిదివరకే తెలియ బరచితిమి. ఈతడు బొంబాయిరాజధానిలో నరసింహేంద్ర పురము నకు దగ్గరనున్న గ్రామములో వసించుచుండెను. ఆతడొక గొప్ప

మార్వాడీ వర్తకుడు. ఆతని మేనల్లునిపేరు రామసింగు. రామసింగు తల్లిదండ్రులు చిన్నతనముననే చనిపోయిరి. అప్పటినుండియు గోపీచందు దగ్గరకుదీసి పెంచి పెద్దజేసెను. రామసింగు యిప్పుడు చాల బలవంతుడు.

గోపీచందునకు వొక్కతెయే కుమార్తె యగుటంబట్టి నతి గారాబముతో పెంచుకొనుచుండిరి. గోపీచందు చిన్నతనమునుండి రామసింగును పెంచెనేగాని తనకూతుని బీదవాడగు మేనల్లున కిచ్చుటకు యంత యిష్టములేదు. వసంత తల్లి యుద్దేశముగూడ అంతే. వారొక ధనవంతున కియ్యవలెనని నాలోచించుచుండిరి కాని వసంత యనురాగ మంతయు రామసింగుమీదనే. ఆతని యందచందముల జూచి యామెయు, యామె సౌందర్యమునుజూచి యాతడును బద్ధపరస్పరాను రాగులై మెరియుచుండెడివారు. ఎప్పటికైనను వసంత రామసింగునే పరిణయ మాడవలెనని పట్టుపట్టియుండెను.

రామసింగు సద్గుణములు గలవాడును, గుర్రపు స్వారియందు మంచి నేర్పరి. ఆతని ముఖచంద్ర మండలమందు వొక కళ నాటి యున్నది. చక్కనిరూపసి. ఆతడిపుడు హంతకులను, నేరస్థులను పట్టుటలో యెక్కువ నేర్పరియని పేర్వడశి యేలికచే గొప్పగొప్ప బిరుదములగూడ సంపాదింపబడి యుండెను. ఎవరైనను హంతకులు తన పరాక్రమదృష్టి ప్రసరించినంత మేరలో నుండినట్లయిన వారిని పట్టునంతవరకు నన్నపానీయములు గూడ జొరక, నిద్రాదేవతనుగూడ దరికి చేరనీయనంతటి ప్రజ్ఞాశాలి. ఆతనికి దొరతనమువారు వేతనము నొసంగి సన్మానించుచున్నారు. రామసింగు యిరువది యెనిమిది వత్సరముల ప్రాయమువాడు.

ఇప్పు డితడొక సోఫాపై మేనువాల్చి నిమీలిత హృదయుడై నాలోచనా సముద్రమున మునిగియున్నట్లు తోచును. ఒకసారి తటాలున లేచి నటునిటు తిరుగుచు నేదియో నాలోచించుచుండెను. అంతలో తపాలా జవాను వచ్చి గుమ్మమువద్ద తలుపుతట్టెను.

రామసింగు :—ఎవరువారు ?

బంట్రోతు :—నేనండి తపాలా జవానును. మీకొక జాబు వచ్చినది.

రామ :—ఎచ్చటనుంచి చూడుము.

బం : అయ్యా, దీనిపై నేమియులేదు. మీ పేరుమాత్రము గలదు. అని యా కవరును యాతనికిచ్చి బంట్రోతు వెడలిపోయెను.

అందీ క్రిందివిధముగా నుండెను.

నిరూపక మహాశయా !

నీవు అత్యద్భుతాపరాధ పరిశోధకుడ వనియు, యేలికలచే గొప్పగొప్ప బిరుదముల పొందితివనియు, సాటిలేని మేటివనియు విర్ర వీగుచున్నావు. అలనాడు నా దుర్గము ప్రవేశించి రహస్య బిలముగుండా పారిపోతివని గర్వింపకుము. లోగడ నీ సామీప్యమున నీ రెండుహత్యా ప్రదర్శనంబులు గావించితిని. రెండవది బహు ఘోరము. అయ్యది నీ మిత్రుడగు జనార్దనుని యింటియందే. నా ప్రతిభ నీవికను చవిచూచెరుంగవు. నన్ను పట్టు ప్రయత్నము మానుము. లేనిచో మీరందరు దారా సుతాదులకు దూరంబై మిన్నరాని కష్టంబుల లోనగుదురు. నీవు పిరికిపందవని భావించెదవేమో. ప్రాణాపాయ స్థితియందు స్వప్రాణ రక్షణము వుత్తమ సంజాతకుల లక్షణము. నీవును నీ మిత్రులునుగూడ నన్నేమియు చేయజాలరు. నా ప్రతాపమీ కమ్మ నవలోకించినదైన నెరుంగగలవు. వృథా ప్రయాసలకులోనై పెక్కు కష్టంబుల డీకొనకుము. వలదను నీ మిత్రుల కుపవ్ఛరించుము.

పాతాళదుర్గము<br>5—12—32

ఇట్లు<br>పిశాచబలగనాయకుడు.

రామసింగా యుత్తరము చదివి తల పంకిచి నిట్టూర్పు పుచ్చెను. తనలో తానేదియో మధ్యమధ్య గొణుగుకొనుచుండెను. చివర కా యుత్తరమును భద్రపరచి తాను లోనికిపోయి రమేశం యని కేక వేసెను. తోడనే యొక పురుషుడు లోపలినుండి వచ్చి "అయ్యా! యేమిశలవు" అనెను. ఓరీ నీవు పోయి బండిని తీసుకురమ్మని తాను లోనికిబోయెను.

ఈ సేవకుడు శరవేగమున పోయి బండిని తీసుకువచ్చి గుమ్మము వద్ద నిలిపెను. రామసింగు తేనీరు గ్రోలి దుస్తులు ధరించుకొని రివాల్వరు తీసికొని బయటకు వచ్చి వీధిగుమ్మమునకు బీగము వైచి యెవరికోసమో అరుగుపై గూర్చుండెను. కొంత సేపటికి యింకొక పురుషుడు ముప్పదియేండ్ల వయస్సుగల నాతడు రామసింగువద్దకు వచ్చెను. వారిరువురును గలసి ద్విచక్ర శకటము నధిరోహించి యెచ్చటికో పయనమై పోయిరి.

౪

దినకరుడు నభోమార్గమునకు ప్రయాణము సలుపుచుండెను. ఎండ యతితీవ్రతగా గాయుచుండెను. ఉదయము పదిగంటలు కావచ్చెను. కర్మాగారమునందలి రక్షకభటాధికారు లందరును యెవరిపనిని వారు నిర్వర్తించుకొనుచుండిరి. లోన యెవ్వరో యిరువురు పురుషులు నేమేమో సంభాషించుకొనుచుండిరి.

అట్టితరి కర్మాగారాభిముఖమున నొక ద్విచక్ర శకటము నాగెను. బండలోనుండి యిరువురు వ్యక్తులు దిగి లోనికి పోయిరి. లోనున్న పురుషులలో నొకడు రామసింగు మహాశయులారా! అనెను.

అవును మాధవా నేను నిన్ననే వచ్చుటకు పయనమైతిని రావీలు చిక్కినది కాదు.

మాధ :—రామ్‌జీ నీవు మెచ్చటికో పోయితివట. ఆ పని యేమైనది.

రామ :—అగుట కేమున్నది. గోపీచందు విడుదల యైనది. ఇదిగో యీ జాబు నిన్ననె వచ్చినదని జేబునుండి యొకయుత్తరమును మాధవరావున కిచ్చెను

మాధవరావు నా యుత్తరమును నా మూలాగ్రముగ చదివి రామ్‌జీ! హంతకు డెంత ధైర్యవంతుడు.

రామ :—జనార్దనా! నీ యింటియందు జరిగిన హత్య విషయములో నేర మెవనిపై మోపిరి.

జనా :—ఏవిధమైన సాక్ష్యము లేనప్పుడు యనుమాన మెవనిపై నుండును. కాని నా సేవకుడు హత్యగావింపబడిన దాసి యప్పుడప్పుడు కలహించెడివారని నా జ్ఞాపకము. దొంగతనము విషయములోగూడ నాతనిపై నా కనుమానమున్నది.

రామ:—ఆ దాసికి యెక్కడెక్కడ కత్తిగాయములు తగిలినవో జూచితిరా?

జనా:—చూడ కేమి నేనును మాధవుడునుగూడ పరీక్షించితిమి. గుండెలలో నొకపోటు కనుపించినది. తరువాత శిరము వేరుచేయబడెను.

రామ :—ఆమె మంచముపై బరుండినా?

జనా :—మంచముమీదనె బరుండినది.

రామ :—అప్పుడు యెన్నిగంటలు కావచ్చును?

జనా :—రెండు గంటలు దాటునని నా యభిప్రాయము. ఎందుచేతననగా నాడు పదకొండున్నర గంటలవరకు గూడా నాకు సరిగా నిదురపట్టలేదు. తరువాత తెల్లవారినదాకా మెలుకువే లేదు.

రా :—తెల్లవారినతరువాత నీవే లేచితివా లేక యెవరైనను లేపితిరా ?

జనా : —నా కనుమానముగా నున్నది సేవకుడే లేపెను.

రామ :—అత డేమనుచు వచ్చి లేపెనో నీ వెరుగుదువా ?

జనా :—ఘోరము ఘోరము ఇంకేమున్నది హత్య యనుచు

రా :—అతని పేరేమి ?

జనా :—వాని పేరు వీరదాసు.

రామ :—మాధవా ! ఆ సేవకుని విచారింపవలయును. వెంటనే పోలీసునిబంపి యాతనిని బంధించి యిచటకు వచ్చునట్లు జేయుము.

మాధవరావు బయటకివెళ్లి వొక పోలీసును బిలచి వొక కాగితము వ్రాసి వానిని కిచ్చెను. వాడు తిన్నగా జనార్దనరా వింటికి సేవకుని బంధించి తీసుకొని వచ్చుటకై వెడలెను.

రామసింగు జనార్దనరావు యిచ్చిన వాఙ్మూల మంతయు తన నోటుపుస్తకముపై వ్రాసుకొనెను మరికొంతసేపటికి పోలీసు వీరదాసుని బంధించి తీసుకొనివచ్చెను.

రామ :—వీరదాసూ ! నే నడుగు ప్రశ్నలకు తగిన సమాధాన మియ్యవలెను. నీవు మొన్న జనార్దనరావింట హత్యా సందర్భములో యేమైన నెరుంగుదువా ?

వీరదాసు :—నేనేమియు నెరుగను.

రామ :—నీ దేయూరు నీ తల్లిదండ్రు లున్నారా ?

వీర :—నాది అసలు కాళీపట్నం. నా తల్లదండ్రులు చాం కాలము క్రిందటనే చనిపోయినారు.

రామ :—మీరు తోబుట్టువు లెందరు ?

వీర :—ఒక్కతెయే.

రామ :—ఆమె మీతో కలసియుండునా ?

వీర :—ఆమెకును మాకును క్రోధము మెండు. అది మమ్మల విడిచి యెక్కడికో వెడలిపోయినది.

రామ :—మీరు సోదరులెందరు ? కాళీపట్నములో మీబంధువు లెవరైన నున్నారా ?

వీర :—మేము యిరువు రన్నదమ్ములము. నా బంధువు లందరు యిప్పు డెచ్చట నున్నారో నా కేమియు తెలియదు. నేను కొంతకాలము యీ వూరనే యొక వర్తకునియొద్ద గుమాస్తాగా యుండి తరువాత యిక్కడ ప్రవేశించితిని.

రామ :—నీవు యీ హత్యా విషయములో యేమయిన పాల్గొంటివా నిజము జెప్పుము.

వీర :—లేదు.

రామ :—సరే. మాధవా ! వీనిని ఖయిదు చేయుము. నిజము నిలకడమీద తేలగలదు.

తరువాత కొంతసేపటకి అందరును వెడలిపోయిరి. కర్మాగారము మూసివేయబడెను.

%

గోపిచంద్ నిర్మల భవనమునకు వెనుకతట్టున నొక యుద్యాన వనము గలదు. ఆ వనమధ్యమందు పద్మరాగ మణిమయంబులగు సోపానపంక్తిచే విరాజిల్లుచు, వినిర్మల వారిపూరముచే నిండుగలుగు చున్న సరోవర మెందుగలదు. అది చతురస్రమై యుండెను. ఆ సరోవరము చుట్టును కలువతీవెలు పద్మలతలుబను యల్లిబిల్లిగ నల్లుకొనియుండెను.

అయ్యాని వసంతఋతువు వసంతోదయము రాగానే మన వసంతకు జవ్వనోదయము సంప్రాప్తమయ్యెను. ఇప్పుడు వసంత యొక నీలమణి తిన్నెపై యాసీనయై యుండెను. ఏ మనోహరుని మనోహాకారము యే మోహనాంగి చంచల కటాక్షమునకు గురియయ్యెనో, యెవ్వాని నామస్మరణ మాత్రంబున యే సుందరగమన విరహవేదనానల నిట్టూర్పు బొగలు విగిడించునో, యెవ్వాని సుకుమార హస్తద్వయంబులకు తన కుచ సముదాయమును పరిధానంబుగ నివ్వ నియ్యకొనెనో యా సుందరుని కోసమే వసంత యెప్పటికి జాడ కన్పడునోయని యెదురు కన్నులు గాయుచుండెను.

మన వసంత హృదయమునంతయు రామసింగు వపహరించెను. ఆమె యిప్పు డెవ్వని గుణగణంబులు హృదయసీమ నాట్యమాడుతరి వొక్కొక్క వేడి నిట్టూర్పు విడుచుచుండెను. ఆహా! పాపము. తన ప్రియుని సముఖ ప్రాణము సహితము యియ్యకొనెను సుందరీమణులలో నొకతె వసంతపదునెనిమిదేండ్లని కుసుమ సుకుమారి. తనంత తాను స్వతంత్రించి యేమిచేయగలదు.

కొంతసేపటికి వసంత పవిత్ర నయనాంబుజములకు నొక వ్యక్తి దర్శనము లభించెను. ఆ వ్యక్తి యెవరు? వసంత మనోనాథుడే కావచ్చును. "వసంతా! యేమిజేయుచుంటివి" అను పదములు వినవచ్చెను. ఒక సుందర విగ్రహము లతాసమన్విత పంక్తి మరుగునుండి బయల్వెడలి వచ్చెను. వసంత దగ్గరకు వచ్చి యేమాలోచించు చుంటివని ప్రశ్నించెను.

చదువరులారా! యీ దివ్యసుందరమూర్తి యెవరు? ఈయన యే రామసింగు. తన విభుని సుందర వదనారవిందము గాంచినతోడనె యామె సిగ్గు నభినయించుచు తల వంచుకొనెను.

రామ—నెచ్చలీ! వసంతభాగమును మానివేసితివేమి. సిగ్గుపడకుము. నీ తండ్రి నీ వివాహసన్నాహము లేమైన జేయుచుండెనా?

వసంత—నాథా! మిమ్ముల విడచి నే నన్యపురుషుని వరింపనొల్ల. నా మనస్సంతయు మీా మనఃపీఠమున చిత్రించుకొంటినిగదా!

రామ—అటులయిన నీవు నన్ను గాఢముగా ప్రేమించితి వన్నమాటయే. అటని యామెను గాఢాలింగనము జేసికొనెను. కొంతసేపు యిట్లె రామసింగు మోహాంబుధిలో దేలియాడి వసంతపద్మ బలవంతపు సమ్మతి పత్రము గైకొని వొక తొందర పనికై రామసింగు యచ్చోటు బాసెను

వసంతయు సాయంసమయ మపుటం జేసి తన భవనమునకు చీకటి పడకముందే చేరుకొనెను. ఇంటికి బోయి తన చెలియగు యిందిరతో జరిగిన వృత్తాంతమంతయు జెప్పెను.

ఈ యిందిర యదివరకే రామసింగు స్నేహితుడగు కేశవరావును ప్రేమించెను. ఇందిర సద్గుణముల గని. కేశవరావు యంత సుందరమైనవాడు గాకపోయినను కురూపిమాత్రము గాడు సామాన్యమైన సౌందర్యము గలవాడు. ముప్పది సంవత్సరముల లోపు వయస్సుండును. మంచి బలశాలి. ప్రతి విషయములోను రామసింగునకు ఉపకారములం జేయుచుండెను.

కేశవరావుకు యిప్పుడు నా ప్తబంధువు లెవ్వరును లేరు. రామసింగును కేశవరావును గూడ వొక్కమారే కవాతు నేర్చుకొనిరి. ఇరువురును కత్తి పట్టుకొని శాత్రవులతో బోరగలరు. వా రిరువురును ప్రాణమిత్రులు. ఎంతటి కష్టముల యందుగాని వొకరు నొకరు వొడ

బోయువారుగారు బ్రహ్మచూపులతో విగ్రహములు పేరఖునను కేశవరావు, రామసింగులు యంతరాత్మలు వొక్కటియే. ఇరువురును బాహుబల సమన్వితులే. జనార్దనరావింట జరిగిన హత్యా విషయములో రామసింగుతో గలసి తాను గూడ హంతకుని విషయమై పర్యాలోచన చేయుచుండెను.

ఆనాడు వసంతయు, యిందిరయు చాలసేపు ప్రసంగించిరి. అందచందములలో యిందిర వసంత కేమాత్రము తీసిపోదు. వీరిరువురు చిన్నతనమునుండియు వొకరినొకరు ప్రేమించుకొనుచు, వారిలో వారికేమైన యాపద తటస్థమైనపుడు వొకరి నొకరు కాపాడుకొనుచు పరస్పరానురాగబద్ధులై యుండిరి. ఇందిరకు పంతొమ్మిది సంవత్సరముల ప్రాయము వచ్చినది.

వారిద్దరు సాయంతనము భోజనములగైకొని చాలసేపు ప్రసంగించి నిదురబోవుటకు వెడలిరి.

... ... ... ... ... ...

రాత్రి పండ్రెండు గంటలయ్యెను. చాల చీకటి గ్రమ్మియుండెను. ఆ నిభిడాటవీ యంధకార మధ్యంబుననుండి వొక పురుషుడు ఖడ్గహస్తుడై దారి చూచుకొనుచు యతితీవ్ర గమనముతో నడచివచ్చుచుండెను. అతడా యడవియందు నలవడినవాడే కావచ్చును. లేకున్న యా పుట్టలను, రాతిమెట్టలను, దాటుట కష్టము. అతని ప్రయాణము చూడ గోపాలపురము వచ్చుచుండెననియే యూహింప వలసియున్నది. ఆ వ్యక్తి శరీరమంతయు నల్లని తోలుదుస్తులు కప్పుకొనియుండెను. అతని ముఖమంతయు నల్లనిరంగు పూయబడియుండెను. అతడు లావునకు తగిన పొడుగుగలవాడు. అతని దీర్ఘకాయము, నల్లని దుస్తులు, చేతియందు తళతళలాడు ఖడ్గము తిలకించిన యెంత ధైర్యవంతులకైనను భీతిజనింపక మానదు.

అతఁడట్లు శీఘ్రగమనమున నడచుచు గోపీచందు భవనమున కుత్తరభాగమున నున్న పుష్పోద్యానవనములోనుండి చిన్నగా భవనమునకు క్రింది తట్టుననున్న వొక గదిం జూచెను. ఆ భవనమును జూచుటకు వీధిమార్గము తప్ప మరొక మార్గమేదియు లేదు.

ఆ నల్లని వ్యక్తి యిప్పుడు మన వసంత పండుకొన్న సోఫావద్ద నిలచెను. ఆమె యా గదిలో చల్లనిగాలి గ్రోలుటకు తలుపులు తెరచుకొని గాఢముగా నిద్రించుచుండెను. ఆ వ్యక్తి యాలసించిన యాశాభంగ మగునని తలచి తన కత్తిని మొలలో దూర్చి, యంగీలోనున్న త్రాటిచుట్టను తీసి, యా నిర్మల మలయమారుతప్రకరణి గ్రోలి గాఢముగా నిద్రించుచున్న వసంత శరీరమునకు నా త్రాటిని జాగ్రతగా, యతి పదిలముగా కాళ్ల సందునుండి లాగి తరువాత యామె నోటిలో పెద్ద గుడ్డను జొనిపి త్రాళ్లచే గట్టిగా కదలకుండా బంధించివేసెను.

ఆయమ పులికిపడి నోట మాటలేక యీ భయంకరాకారము జూచి భయవిహ్వల చిత్తయై కండ్లు మూసుకొనెను. వెంటనే యాతడు నామెను చంక నిరికించికొని యా కాళరాత్రియందు పలాయితుడయ్యెను.

౬

ఉదయము ఏడుగంటలైనది. గోదావరీనదీ తీరమున రామసింగు ప్రభృతులుతమలో తాము యీ విధముగా మాట్లాడజొచ్చిరి.

రామ:—జనార్దనా! దొంగ లపహరించిన పన్నెండువేల రూప్యములు యెవరు సంపాదించినవి.

జనా :—అది నా తండ్రిగారు సంపాదించినదే.

రామ :—అట్లయినచో యీ డబ్బంతయు దొంగిలించిన [illegible] మేమైయుండును. ఎప్పటికైనను మనము సొమ్ముజాడ కనిపెట్టవలయును.

మాధవరావు :—రామ్‌జీ! మన[illegible]ంతుగా మొన్నటి వీరదాసును కొన్నిప్రశ్నలడుగవలయును

రామ :—అవును. మరచితిని ఈవాడు మన సుందరము కర్మాగారమునకు పెందలకడ పోయి కర్తవ్య[illegible]లోచింతము.

అనుచు వారు ముగ్గురును తిన్నగా కర్మాగారమువద్దకుపోయి తలుపుల బీగమును సడలించి లోనకు బోయి ఆసనములపై యాసీనులయిరి. మాధవరావు లేచి ప్రక్కగదిలోనికి పోయి తలుపు తాళము దీసి—

"వీరదాసూ! ఏమి చేయుచుంటివి. నీకు యీనాడు మరల వాయిదా. నిన్ను కొన్నిప్రశ్నలడుగవలయును" అని నాతనిని తీసుకొనివచ్చి రామసింగువద్ద నిలువబెట్టి తాను యెప్పటియట్లు తలుపునకు బీగమువైచి మరల కుర్చీపై నాసీనుడయ్యెను.

రామ :—వీరదాసూ! మొన్నటి హత్య దొంగతనము విషయములలో నీ వేమియు యెరుగవుగా ?

వీర :—అయ్యా! నాకేమియు తెలియదు నన్ను మీరంతగా బాధించవలదు.

రామ :—ఏమిరా ? అడిగినప్రశ్నకు సమాధానము సరిగా చెప్పవా ? లేకున్న నిన్నిప్పుడు లాటీకర్రతో వాయించెదను.

ఆమాట విని వీరదాసు యెందుకొరకో జేబు తడుముకొనుచుండెను. మాధవరావు అదికనిపెట్టి "జనార్దనా! మనము ముందీతని జేబు పరిశీలించవలెను. ఈత డెందుకొరకో జేబు తడుముచున్నాడు" డనెను.

ఆమాట రామసింగు విని వీరదాసూ! నీ జేబులో నేమున్నదో తీసి యీవల బెట్టుము లేకున్న నిన్నిప్పు డేమిచేసెదనో చూడుమని భయపెట్టెను.

ఈ వీరదాసు కొంచము బలిష్ఠమైన శరీరము గలవాడే. మీసములు బుగ్గలవరకు వ్యాపించెను. చూపులయందు క్రౌర్యరసము ప్రస్ఫురించుచుండెను. అతడు రామసింగు ముఖమువైపు చూచుసరికి వొక విధమైన భయము పొడసూపుచుండెను.

రామ :— ఏమిరా వూరకొంటివి. వినపడ లేదా ?

వీర :—అయ్యా! నావద్ద యేమి యును లేదు. నేవంత దొంగ ననుకొంటిరా ?

రామ :—అడిగిన ప్రశ్నకు సమాధాన మీక శ్రీరంగ నీతులు జెప్పుచుంటివా ? నీకు తగినశాస్తి చేసెదనని తన యంగీనుండి రివాల్వరుతీసి ప్రేల్చువానిపగిది నటించి ఓరీ జాగ్రత నీవద్ద నే ుండెనో తీసి బయటబెట్టుము. లేకున్న నిన్నిప్పుడు తప్పక కాల్చి వేసెదను. అని బెదరించెను.

వాడును భయమంది వున్నవి. నావద్ద రెండు కాగితము లున్న వని భయవిహ్వలచిత్తుడై రెండు కాగితపు ముక్కలుతీసి రామసింగు కూర్చున్న బల్లపై నుంచెను.

అందొక కాగితమును విప్పి వారు ఈ క్రిందివిధముగా చదువ దొడంగిరి.

ప్రియమిత్రమా !

నీ యనుంగు సఖుడు జగత్ కింకరుడు ప్రాయుసంగతి—

నరసింహేంద్రపురమున జనార్దనరావింట హాత్యకయి నీవు నాకు సాయపడుదువని నా నమ్మిక. అతని పంద్రెండు వేల రూప్యములు మన స్వాధీనమున నుండవలెను. జాగ్రత్తగా మసలుము. మీతో

కలహించిన నీ సోదరియగు యా నళినిని చంపినగాని వీలుండదు. నీచర్య
లకు సంతసించి నా గుప్తఖడ్గము నీకు బహుకృతిగా నొసంగుచున్నాను.

ఇట్లు
పిశాచబలనాయకుడు.

వారా జాబులో యున్న [illegible] యంతయు విని క్రోధదందహ్య
మానసులై వీరదాసునిగ యెంతటి వాడురాయని నివ్వెరపడిరి.

తరువాత వానివద్దనున్న గుప్తఖడ్గము గూడ బలవంతముగా
తీసుకొని యాతనిని లాటీకర్రతో వొడలంతయు గాయములు పడు
నట్లుగా మోది వొక చీకటికొట్టులో బంధీచేసిరి. తదుపరి వారు రెండవ
కాగితమును విప్పి చదివిరి. దానిలో నిట్లుండెను.

నా ప్రియమిత్రుడు వీరదాసునకు—

మిత్రమా! రేపు మూడవరోజున నీతో కొన్ని రహస్యములు
మాట్లాడుటకు నా వద్దనున్న సింహబలుడను వానిని నరసింహాగ్ర
పురము బంపెదను. నీవు జనార్దనరావు భవనము ప్రక్కనున్న కొండ
గుట్టల దగ్గరకు రావలెను. అక్కడ మాట్లాడవచ్చును

ఇట్లు
నీప్రియమిత్రుడు.

రాము—జనార్దనా! పాపము సింహబలుడట తప్పక యానాడు
మనము వానిని బట్టవలెను. కేశవరావును నేనును గుఱ్ఱములపై బోయి
వానిని బంధించెదము. మీరుమాత్రము రివాల్వరులతో యాకొండ
గుట్టలలో దాగియుండుడు. ఆ సింహబలుని గర్వమడంపవలెను.

వారు మువ్వురును నా యుత్తరములను మరల మరల చదువుచు
గుట్టు దొరికినదిగదా యని సంతోష పులకాంకిత దేహులగుచుండిరి.
అప్పటికి తొమ్మిదిన్నర గంటలు కావచ్చెను.

అంతట నొక ద్విచక్రశకటము వచ్చి ధర్మాగారమువద్ద నాగెను. రామసింగు నా బండిలో నెవరో చూడవలెనని కుతూహలముతో బండినప్పుడు వినబడగానే బయటకు వచ్చి నిలబడెను. తోడనే యా బండిలోనుండి యొక సుందరమైన దీర్ఘ కాయుడు దిగెను.

దిగుటతోడ తడవుగా రామసింగు "ఓహో! కేశవరావా బహుకాలదర్శనమే" అనెను. రామ్‌జీ! యిప్పుడు మాట్లాడుట కవకాశము లేదు. నేను వేగముగా గోపాలపురమునకు పోవలెను. అచ్చట మీ వసంతి నెవ్వరో నపహరించిరట. నీకీ వార్త తెలియ పరచి దోడ్పాటునిపొందుటకై రావలసివచ్చినది. గోపీచందునకు నిప్పుడు స్పృహ లేదని కేశవరావు జెప్పెను.

ఆ వార్త విన్నతోడనే రామసింగు మారుమాటాడక కేశవరావుతో బండి నధిరోహించి గోపాలపురమునకు నతితీవ్ర గమనముతో బారితీసిరి.

... ... ... ... ... ...

ఓ కుమారీమణీ! నిన్నే దుర్మార్గులు యపహరించిరోగదా! ఆ క్రూరుని కర్కశ హస్తముల తాడపీడనమునకు నీ మృదుశరీరము యెంతనొచ్చెనోగదా! హాయిగా మన సుందర మందిరమున నుండి వాస మొనర్చు యదృష్టమునకు నోచుకొనక పోతివా? ఆహా నీ యందచందముల జూచి యానందించెడివాడనే. ఇంకెవ్వరినిజూచి పుడమిపై బ్రతుకగలను. ఇంకెవ్వరిని నాముద్దుతనయయని భావింతును. నీవు యెవ్వరికి యపకార మొనరించితివి. నీ యుపకారమునకు యే దుర్మార్గుడైన ప్రతికార మొనర్పవలెనని పట్టుదల వహించి నిన్నీ ఘోరనరకంబున బడద్రోసెనో? అయ్యో! లేని బిడ్డవే. నేనింక జీవింపజాల. నా కుమారీరత్నము నాకు లేకున్న నేనుమాత్ర మికెందులకు. తల్లినేనుండి యేమి ప్రయోజనము? అని గోపీచందు యేడ్వదొడంగెను.

వసంత నపహరించిన వార్త గోపాలపురమంతయు వ్యాపించెను. గ్రామములోని జనులందరు గుంపులు గుంపులుగా గోపీచందు భవనమువద్దకు వచ్చుచుండిరి. అంతలో నొక బండిలోనుండి రామసింగు కేశవరావులు దిగి గోపీచందు యున్న గదికడకు బోయిరి. అక్కడ గోపీచందొక తివాసీపై కూర్చొనియుండెను. వీరిని చూచి యాతడు మరల యేడ్వదొడంగెను.

రామసింగు ముఖమునందలి కళాకాంతు లుడిగిపోయెను. తన మామ విచారము చూచి యతడును కండ్లనుండి యశ్రుకణంబులు రాల్చదొడంగెను. పాప మాతని హృదయములో నొక విధమైన కలవర ముదయించెను. అది యంతయు తన ప్రేయసియగు వసంతకొరకేగా అలనాడు వుద్యానవనములో నా సఖీమణిని సమాధానపరచుటకు యోగివేషముతో దర్శన మిచ్చుతరి నా యబలామణి నన్నే తన ప్రియునిగా కోరు ప్రశ్న లడిగినదికదా? నేనును సఫలమవుననికదా జెప్పితిని. పరిపరి విధముల రామసింగు తలబోయజొచ్చెను.

కేశవరావు——అయ్యా గోపీచందుగారూ! మీరు యెంత విచారించినను లాభము లేదు. ధైర్యము వహింపుడు. ఆమెను యెవరో దుర్మార్గులు నపహరించిరి. ఆమెకొరకై మా శాయశక్తుల ప్రయత్నించి తీసుకొనివచ్చెదము. అని గోపీచందునకు ధైర్యముచెప్పి రామసింగును తీసుకొని కేశవరావు పయనమైపోయెను

8

ఒక శయ్యామందిరమున పూలప [illegible] చుండెను. ఆమెను సుందరియే యనజెల్లును. ఈ యబల మోమునం దొకవిధమయిన ప్రేమజూడ్కులు గలవు. ఆమె మంచి నిద్రావస్థలో మునిగియుండెను.

అంతట నొక పురుషుడేతెంచి యామెకడకు బోయి యిందిరా యని లేపెను. ఆమె లేచి ఓహో కేశవరావుగారా యని ప్రశ్నించెను.

కేశ — నెచ్చెలీ! యీనాడు పెందలకడ నిద్రించుచుంటివే కారణమేమి ?

ఇం — కారణ మేమున్నది. మన వసంతను తలచుకొనిన నాకు విచారము పొంగి పొరలి వచ్చుచున్నందున బరుంటిని.

కేశ — అగును. మీ రిరువురును ప్రాణసఖులుగదా! నేను నొక రహస్యము జెప్పెదను నీవు జాగ్రత్తగా వినుము.

ఇం — మనోహరా! జెప్పుడు.

కేశ — ఇందిరా! నేను మారువేషముతో పిశాచబలగముండు చోటికి బోయి కపట జ్యోతిష్యునివలె నటించి యా క్రూరబలగము నంతను నా మాయా జ్యోస్యములో ముంచి వసంత క్షేమ మారయు చుందును ఈ నా యాలోచనకు రామసింగు కూడ సమ్మతించినాడు నామెను విడిపించినతరువాత రక్షకభటులతోను, మన జనార్దన మాధవ, రామసింగు ప్రభృతులతో దా బలగమును చెండాడవచ్చును.

నీవు మాత్రము యీ వేషముతోనె బోయి, యాక్రూరబలగ నాయకుని మోహవార్ధిలో ముంచి మదోన్మత్తుని చేయుము. మధ్య మధ్య వసంతను కాపాడుచుండుము నిన్నుజూచిన యా దుర్మార్గుడు తప్పక వశ్యుడుకాగలడు. ఇంక నుపేక్షించిన లాభము లేదు. నేను నీకు సాయపడుచుందును. మన శక్తినంతయు వినియోగించి నా యంతకుల నురుమాడవలెను. పాపము వసంతను యెట్టిబాధలు పెట్టుచున్నాడో యా నరాధముడు. కావున నా మాట పెడచెవిని బెట్టక నే చెప్పిన ప్రకారము జేయుము.

ఇంది :—ప్రియా ! మీ మాట కెదురాడుదాననా ? అట్లె యొనర్చెదను. కాని మీరుమాత్రము జాగ్రతసుమా ? నా ప్రాణము లన్నియు మీ మీదనె యుండును. అనవరతము లోకమోహనమైన మీ స్వరూపమును గూర్చిన చింతను మానను. మనోనాయకా ! నాకు మరల మీ దర్శనభాగ్య మెన్నడో గదా ?

కేశ :—ఇందిరా నాకు పనివేళ అయినది. కొద్ది కాలములోనె వెళ్లవలయును. నీవు మాత్రము నీ శీలము నెట్లు కాపాడుకొందువో. అని యాతడు వెడలెను.

... ... ... ... ... ...

నరసింహేంద్ర పురమునకు తూరుపుదెస గోదావరి ప్రవహించుచుండెననిగదా వ్రాసియుంటిమి. ఈ పురమునకు యీ నది పుట్టినచోటు పదునేనుక్రోసుల దూరములో నుండెను. ఈ నరసింహేంద్ర పురములో జనార్దనరావు దివ్యభవంతికి యెడమవైపున కొండలు, గుట్టలు, చెట్లు యనేకములు గలవు.

అయ్యది యంత యరణ్యము గాకపోయినను పొదలు, ముండ్లు మాత్రము నిండియుండును. ఆ వన్య మధ్యంబునుండి గౌతమీనది ప్రవహించుచుండెను.

రాత్రి తొమ్మిదిన్నర గంటలైనది. నరసింహేంద్ర పురమునుండి నలుగురు వ్యక్తు లతితీవ్ర గమనముతో యీ యడవి వైపునకు వచ్చుచుండిరి. వారు నలుగురును బహుబలాఢ్యులేయని వారి వేషధారణ వలన తెలిసికొననగును. వారొక లోయగుండా నడచి వచ్చుచుండిరి, ఆ నడచివచ్చు పురుషులలో నొకడీ క్రింది విధముగా పలుకరించెను.

ఒకడు :—మాధవా ! మనము కాయవలసిన గూడస్థల మియ్యదియేగదా ?

మాధ :—అగును. నేనును జనార్దనుడు యిచ్చట లోయలో జాగ్రత్తగా దాగియుండెదము. మీ రిరువురును మెల్లగా రివాల్వరుల సంధించి పైకిబోయి వొక వృక్షముపై దాగియుండుడు. నాతడు వచ్చిన వెనుక మన మనుకొన్నట్లె జరిగింతము.

రామ :—కేశవా ! మన మిరువురము పయికి పోవుదము. ఆలస్యమువలదు. జనార్దనా ! జాగ్రత్తసుమా చప్పుడు కానీయకూడదు. ఈ నాడు సింహబలుని తప్పక పట్టి బంధించవలెను.

మాధ :—రామ్‌జీ ! నీ వతిజాగ్రత్త. వాడు పలాయితు డగునేమోసుమా ?

జనా :—కేశవా వాడు చిక్కగనే మేము పర్వెత్తుక వచ్చెదము నీవుమాత్రము యీలవేయుము.

అనుచు వారు లోయం జేరి యందిరువురు దాగి మిగిలినవారు కొండ నెక్కి వృక్షాగ్రముపై నధిష్ఠులైరి.

అంతయు నిశ్శబ్దముతము. ఏలకో లేళ్ల చప్పుడు వినవయ్యెను చెట్టుపై నున్నవారు మరల ననుమానాస్పదముగా నిట్లనుకొనిరి.

రామ :—కేశవా ! నీవు చెట్టుపై నుండుము. నేను క్రిందనె యుండెదను. ఎందుచేతననగా నన్ను జూచి యా సింహబలుడు మిత్రుడనుకొనియే భావించును. ఆతడు వచ్చువేళ యైనది. చప్పుడుగూడ వినవచ్చుచున్నది. నే నాతనితో కలియబడగనే నీవు యీలవేసి వెంటనే రివాల్వరుగుండ్లు నాలుగు ప్రేల్చుము. నతి త్వరితముగా చెట్టుమీదనుంచి దిగి నాకు సహాయము చేయుము. ఈ యాలోచన బాగుండినదా ?

కేశ :—ఇదియే బాగుండినది అట్లైయైనత్రము వాడు దగ్గరకు వచ్చువరకు నీవు మాత్రము కదలక యుండవలయును. వచ్చినవెంటనె మిత్రమా యని పలుకరించుము.

రాము—నీ యూహ బాగుగానున్నది. అట్లె యొనర్చెదను నీవు మాత్రము జాగ్రత్త.

తరువాత రామసింగు క్రిందకు దిగి చెట్టుక్రింద నిలువబడి యుండెను.

అంతయు గాఢాంధకారమయము. అప్పు డెచ్చటినుండియో యొక దీర్ఘకాయుడు, గంభీర హృదయుడు చేతియందొక కృపాణమును ధరించి వచ్చుచుండుట రామసింగు జూచెను. వెంటనే రివాల్వరును సంధి కయిజారును తీసి సిద్ధముజేసికొనెను. ఆ వచ్చుచున్న వ్యక్తిని జూచి రామసింగు యేమియు భయపడలేదు. చివరకాతడు దగ్గరకు రాదొడంగెను. ఇది యంతయు వృక్షముపైనున్న కేశవుడు గూడ పరికించుచునేయుండెను.

ఆ వల్లనివ్యక్తి రామసింగును దూరమునుండియే జూచి ఆ తెలసినది. మన మిత్రుడు వీరదాసు వచ్చినాడు అని బిగ్గరగా యరచి వేగముగా రాదొడంగెను. ఇది విని మనవారిరువురు నాశ్చర్యనిమగ్నులయిరి. ఈ వచ్చుచున్న వ్యక్తి చాల బలమయినవాడు, యాతని ముఖము చాల భయంకరముగా నుండుట రామసింగు చూచెను.

కొంతవడికి నా వ్యక్తి రామసింగు కడకు వచ్చి మిత్రమా యనియెను. అప్పుడే పయినుండి దిక్కులు పిక్కటిల్లునట్లు ఠాం ఠాం యని నాలుగు గుండుదెబ్బలు వినబడెను. మన రామసింగు రివాల్వరును తిన్నగా నతనికి గురిపెట్టి కాల్చెను.

ఆతడు కవచధారణుడై యుండుటచే నయ్యది వాని నేమియు బాధించలేదు. వాడు వెంటనె నివ్వెరపడి ఆహా వీడు మిత్రుడుకాడు యెవ్వడో! శత్రువు ఎవ్వడయిన నేమి యని కత్తిని రామసింగు వైపునకు విసరెను. అయ్యది రామసింగునకు తగులక ప్రక్కనుండి పోయెను.

అప్పుడు వారిరువురును పోరాటములం గ్రుద్దుకొనుచు క్రింద బడుచు, మీదబడుచు, నొకరినొకరు మించి పోరవాడంగిరి. మన. కేశవుడు వెంటనె యీలనూదెను.

ఊదిన వెంటనే లోయలో దాగియున్న యిరువురును. చెట్టు పైనున్న కేశవుడును గూడ రామసింగునకు సహాయులైరి. ఆ సింహ బలుడును, రామసింగును నొకరికొకరు తీసిపోక ముష్టిఘాతములచే కొట్టుకొనుచుండిరి. మకరి గికరి యని కనికరించక హోరి [illegible] మకరిపై కలియబడెనో యదేవిధమున రామసింగు పిడిగ్రుద్దులచేతను, బాహుబలముచేతను వానిని కొట్టుచుండెను.

రామసింగు మిత్రులువచ్చుట గాంచి మరింత సంతోషపర వశుడయ్యెను.

రెండవవాడు వీరినందరను చూచి యిక లాభము లేదు వీరందరు కపటముగా నన్ను బట్టనెంచి యిట్లు చుట్టుముట్టినారు వీరిని తప్పించు కొనిపోవుట కల్లయని తలంచి వారలకు లొంగిపోవుచుండెను.

తుదకు రామసింగు వానిని కాలితో నొక్క తాపు తన్నెను. వెనుకనుండి కేశవుడు తన లాటీతో నొక్క ప్రహారము నాతని తలపై మోదెను. ఆ రెండు దెబ్బలతో నా సింహబలుని పని ముగిసెను. మన రామసింగు గాఢముగా పోరియుండుటచే యలసట దీర్చుకొనుటకై క్రింద చతికిలబడెను.

మిగిలినవారు సింహబలుని గట్టిగా త్రాళ్ళచే బంధించివేసిరి. అక్కడితో సింహబలుని పనిసరి. ఏమనుకున్నాడో రక్షకభటాధికారులన యని మాధవ కేశవరావు ప్రభుతులు ఘోషించిరి.

తరువాత రామసింగు యలసట దీర్చుకొని తన మిత్రులతో గలసి శాత్రవుని బంధించుకొని వెడలిరి.



౭

గోపాలపురమునకు దక్షిణము గోదావరీనది ప్రవహించుచుండెనని గదా వ్రాసితిమి. ఆ నది ప్రక్కన గాఢాంధకారమైన యడవి గలదనియు యీవరకె దెలిసికొంటిమి. ఆ యడవి యీ పురమునకు మూడుమైళ్ళ దూరమున నుండెను. ఆ యడవియంతయు క్రూరజంతు సముదాయముల చేతను, నానావృక్ష లతాగుల్మములచేతను, ముండ్ల పొదలచేతను, క్రూరసర్పములచేతను, నిబిడీకృతంబై యుండును. అందున్న వృక్షములు దట్టమై, సూర్యభగవానుని వెల్తురేమాత్రమును భూముపై పడకుండునటుల జేయుచుండును. అందుచే రాత్రిసమయమే గాకుండా పవలంతయు గూడ నా యడవి చీకటులచె దట్టముగా నావరించుకొనబడి యుండును.

అట్టి యీ భయంకరాటవీ మధ్యస్థ మార్గమునుండి నొకనాటి మిట్టమధ్యాహ్న కాలమందు నొక మనుజుడు కాషాయపు రంగుగల యంగరఖాను ధరించి, యటువంటి రంగుగలిగినదే నొక తలపాగను జుట్టి, చేతియందొక జారీకొమ్ముగల చెంబు పట్టుకొని మిగిలిన వస్తువు లన్ని పెట్టుకొనుటకు తగియున్న యడప మొకటి భుజముపై వ్రేలాడుచుండ, రెండవ చేతియందున నొక దండము ధరించి, దీర్ఘాలోచన పరుండై క్రిందనున్న ముండ్లను, రప్పలను, గుట్టలను దప్పించుకొనుచు వచ్చుచుండెను. ఆత డెచ్చటికి పోవ సంకల్పించుకున్నాడో యెవ్వరికి తెలియదు.

ఇరువది వత్సరముల ప్రాయముననె ముసలితనము వహించి మూలకూర్చుండ నిచ్ఛగించు యభ్యాసముగల దుర్బలులగు కొందరి వలె గాక నీతడు మంచి పిక్కబలిమి గలవాడై యీ కంటక శిలా మార్గమును గూడ నిర్గమించి పోవుచుండెను.

ఆతని వేషమును జూచిన యతఁడొక యోగీశ్వరుడనియే భావింతురు. అతని ముఖము వీక్షించిన నొకానొక కార్యభారము నొదల ధరించి, యహోరాత్రములు తత్ సాధనము నిమిత్తము పాటుబడుచుండెనని యూహింపకపోరు. మిటమిట లాడు యా తీక్షణపు టెండయందు దీర్ఘప్రయాణముచె నలసిపోయిన యీ పాంధుడు యందుండెడి చల్లని తరుచ్ఛాయలక్రింద విశ్రమించి తన యాయాసమును దీర్చుకొన దలచినవాడై [illegible] వృక్షముక్రింద నిలబడి చేతియందుండెడి దండ[illegible]ను క్రింద నుంచి, చెంబును క్రిందబెట్టి, చెమట పట్టుటచే తొడుగుకున్న చొక్కాయంతయు తడిసిన కారణమున [illegible] దానిని గూడ విప్పి తరుశాఖకు తగిలించి, నిట్టూర్పులు నిగిడించుచు క్రిందయాసీనుడయ్యెను.

అంతలో నెక్కడనుండియో నొక కలకలము విననయ్యెను. తోడనే యాతండిట్లు తలంచెను.

ఓహో! యీ నిర్జనప్రదేశములో యీకలకల మెక్కడిది. ఇది యంతయు హంతకు చర్చయేయని యూహింపనగు ఇప్పుడు వారు నన్నుజూచిన నాకోసమై యిక్కడకు వచ్చి నన్ను బంధించుకొని పోవుదురు. ఆ యట్లయినను యుక్తమే.

వారు నన్ను బంధించుకొని పోయినచో నాకు మేలేయగును. కారణ మేమన నేను యిన్నియు తిరిగి తిరిగి కష్టముల పాలయి దారి తెలియక చిక్కులు పడుటకన్న యే హంతకుల బలగమును నురుమాడ దలంచుకొన్న రామసింగు సహాయార్థము యీ పాతాళ దుర్గము సాధించి వారల దండింప సమకట్టితిమో నచ్చోటకు వారే నన్ను గొంపోవుట యుక్తముగాదె వారు నన్ను బాధించకయే గొంపోవుదురు.

ఏమన, నా మాయ యోగివేషము గాంచిన వారు భయచకితు లగుదురు. ఒక వేళ యటు కాకున్న వారు హంతక నాయకుని సేవకులై యుండుదురుగదా? బాధించుటతో వారికి నిమిత్తమేమి? వారిపని కేవలము నాయకునికి నప్పగించుటయే.

వారొకవేళ నన్నేమయినను జే[illegible]పెట్టిన మదీయ శక్తి సామర్థ్యంబులు చవిచూపించుట కవ[illegible]మున్నదిగదా! అదెట్లు జరుగును. ముందు నేననుకొన్నట్లె జరిగితీరవలెను. అని యాతడు తనలో తాను యూహింపజొచ్చెను.

తుదకాతడు ఓహో! యెవరో దుండగీడులు కొందరు యిటే వచ్చుచున్నట్లున్నారు. అని తాను చెట్టుకొమ్మకు తగిలించిన చొక్కాను ధరించి, కమండలము తీసుకొని, దండము పట్టుకొని, మాకలకలము జేయుచు వచ్చుచున్న దుండగీడులవైపు చూచుచు నెమ్మదిగా నడువ దొడంగెను.

ఆతడట్లు రెండుమూడు గజముల దూరము పోవునరికి యారు గురు నల్లని శరీరము గలవారు, గాంభీర్య హృదయులు చరచర ముందునకు వచ్చి యేమి బాపనయ్యా యెక్కడకు బోవుచుంటివి యని ప్రశ్నించిరి.

వారిమాటలకు మన కపటయోగి భయపడక యిందే కొంచెము పనిపై నరుగుచుంటినని వాక్రుచ్చెను. వారు యట్లనా! నిన్నిప్పుడు మాయేలికయగు పిశాచబలగ నాయకునొద్దకు తీసుకొనిపోవుదుము. నీవు యిక కదలుటకు వలనుబడదు. నడువుము నడువుము వేగముగా పోవలయునని తొందర పడజొచ్చిరి.

ఒకడు—ఒరేయి వీడు మునీశ్వరయ్య గాడిలాగేయున్నాడు.

రెండవ—అవునురా. ఈయన ప్రశ్నల చెబుతాడురా.

మూడవ—అలాగైతే మన పెభువు యీరిని గారవిత్తాడుసుమా.

అని వారిలో వారేదియో సణుగుకొనుచుండిరి. అంతట కపట యోగి యీ విధముగా వారలతో మాట్లాడెను.

ఓహో! యమకింకరులవలె నన్ను పట్టుకున్నారే నన్ను యిక్కడనుంచి కదలనివ్వరు కాబోలు. ఏమిరా నన్ను విడిచిపెట్టండిరా బాబూ!

ఒకడు—ఆ నడు నడు. మాకు యేలయిపోతోంది. ఇంక మాటాడేవంటే మాటదక్కదు.

అందులకు మన యోగి సమ్మతించెను. వారందఱు నా యోగిని పెట్టుకొని పోయిరి. పాఠకులారా! ఈతడే మన కేశవరావు.

... ... ... ... ... ...

అహో! మన వసంత యేమయ్యెనోగదా! పాపము దుర్మార్గుల వలలో చిక్కుపడెను. ఎట్టిబాధను లొందుచున్నదో. నవరత్న ఖచితమగు కుడ్యములచేతను, శోభాయమానమయిన చలువరాతి కట్టడములచేతను, జలవిహంగములు, కొదమరాయంచలు విహరించు నిర్మలవారి పూరంబులగు సరోవరంబులచేతను నిండియున్న తన స్వాతిభవనాప హంసతూలికా తల్పరాజంబునను, బంగరు తూగుటుయ్యాలలోను సుఖనిద్రచెంది హాయిగా మలయానిలుని చల్లనిగాలిం గ్రోలుచు విహరించి సుఖముగా ప్రొద్దు వెళ్ళబుచ్చుటకు నోచుకొనక పోయితినిగదాయని వసంత కటికనేలపయి గూర్చుండి విచారించుచుండెను.

పాతాళదుర్గములో నామె వొక చీకటిగదిలో గూర్చుండెను. ఆగది చాల యిరుకుగ యుండెను. పాపము వసంతకు యెట్టిగతి సంప్రాప్తమయ్యెను. ఏమిచెయ్యగలదు. అబల. శుష్కోపవాసములచే నామె నిండుచందురు నిరసించు నెమ్మోము వాడి యశ్రుధార నిష్క్రమణముచే విచార సముద్రములో మునిగి తేలుచుండెను

ఆహా! నా మనోభవు బారినుండి నన్ను తప్పించి నా ప్రేమాశాలతను ద్రెంచివేసిన యా ఘోరకలుషుని యెంతని దూరవలయును.

హఠాత్తుగా నొంటిగనై యున్నసమయంబున నన్ను బంధించెగదా? నన్నతిగారాబంబుతో పెంచి పెద్దదానినిజేసి అమ్మా యని లాలించి, అన్నము తిననప్పుడు తాను స్వయముగా తన స్వహస్తములతో నా దేహము నిమిరి వసంతా! యన్నము తినవా? నీవు తినకున్న నాకు మాత్రమెందులకు యని నన్నెక్కుడు ప్రేమించు నా తండ్రి నాకై విలపించుచుండెనో.

నేను లేకున్న నాతడొక్క ఘడియ నైనను మనగలడా? ఏమి నా వెర్రి. ఇంకేటితండ్రి. ఇంకేటి మనోభవుడు. వారు నా కెన్నటి కైనను దర్శనమిచ్చి నన్ను గోపాలపురమునకు గొంపోవుదురా?

ఈ నీచుని యీ హంతకుని అబలా బలాత్కారప హారణుని యెప్పటికైనను నా మనోవల్లభుడు చీల్చి చెండాడి నన్ను పాణిగ్రహణ మాడినవరకు యెట్లో కొనయూపిరితో బ్రతికియుండెదను.

హో నా యిందిరా! నీవు నన్నెడబాసి వేరైపోవలసివచ్చెనా? అయ్యయ్యో నీ వెట్లు భరింతువు. నా యీ వియోగమును నీవు మాత్ర మెట్లు సహింతువు నెచ్చెలీ యిందిరా! నీవు నా కొరకై విచారింపకుము అల్పదరిద్రనై యున్న నేను మీ కెట్లు దక్కుదును. ఈ ఘోర హంత కుడు నన్నెన్ని యిడుమల పెట్టుచుండెనో మీ రెరుంగుదురా?

ఓ రామసింగు మహాశయా! యెప్పటికైన యీ నీచుని కండ గ్రొవ్వణగింప ప్రయత్నించవా యని వసంతి కన్నీరు ధారగా యేడ్వ దొడంగెను.

అంతట బయటనుంచి వసంతా వసంతా నేను కేశవుడను. ఇంత వరకు నీ గవాక్షపు తలుపుచాటుననుండి నీ దీనత్వమును వింటిని గవాక్షపుతలుపు తెరచెదవా యను మాట వినవచ్చెను.

మన వసంత నివ్వెరపడి గవాక్షపుతలుపు తెరచెను. తోడనే వొక యోగి ప్రత్యక్షమయ్యెను. ఆ యోగి యిట్లు యామెతో ప్రసంగించెను.

యోగి :—వసంతా! ఏమి యిట్లు భీతిల్లెదవు. నేను యీ మాయా యోగివేషమున నున్న కేశవరావును. అమ్మా! నన్ను నీవు మరొక విధముగా తలంచవలదు. నేనును యిందిరయు గూడ నీక్షేమ మారయునిమిత్తము యీ పాతాళదుర్గము ప్రవేశించితిమి. ఆమె యీ హంతకుడు నిన్ను బాధించకుండ వానిని తన వలలో వేసికొనుచు నిన్ను తప్పించుచు, తాను తన శీలమును గాపాడుకొనుచు వానిని వెర్రి యెత్తించి కుక్కవలె త్రిప్ప ప్రయత్నించుచున్నది తెలిసినదా?

నేనును యీ మారువేషముతో వారల నెట్లయిన నామాయా జోస్యములో ముంచుచు, నమ్మకములు గలిగించుచు యెత్తెరంగున మసలవలెనో యట్లె మెలంగెద.

నీవు మాత్రము పలుబాధ లందుచుంటివి. నా బ్రతుకికేలని కూడని సాహసముజేసి నీ మనోనాథుని నింద పరుపకూడదుసుమా? కష్టే ఫలే యను నీతి వాక్యమును జ్ఞాపకమునం దిడుకొనుము. ప్రస్తుతము మీవార లందరకు క్షేమమే కాన నేనిక పోయి నా కపటజోస్యముచే వారిల నొకయాట యాడించెదను. వసంతా నాకిక సెలవు

వసంత :—కేశవా! మంచిది. ఇప్పుడు నిన్నెవరయినను జూచిన ముప్పు వాటిల్లగలదు. దైవమునకు మనపట్ల యెప్పుడు కృపగలుగ గలదో యంతదనుక నోపికపట్టక దప్పదుగదా! కాన నీవింకను పోయి కార్యసాధనకై పాటుపడుము.

యోగి :—అమ్మా! నేను పోవుచుంటిని. జాగ్రతసుమా యని యా కపటయోగి యచ్చోటువాసెను.

... ... ... ... ... ...

ఆహా! మోహ మెంతచెడ్డది. లోకమంతయు యీ మోహము

పయిననే నిలబడియున్నది. ఇది చాల యపాయతరమగు వస్తువు. మోహ మను విషము తలకెక్కెనేని దానిని మరల్చుటకు సమర్థవైద్యులకైన తరముగాదు ఆ మోహమంతయు మరణ మాసన్నమైన కాలము నెయ్యెకుపోవునో. మరి యెచ్చటికిని పోదు.

అప్పటికిని నివృత్తికాని యీ విషజ్వాలలు యీ ప్రాణమును పీడించుచు వెనుదవ్వులునవియే ఘంటాపథముగ జెప్పవచ్చును.

మన పిశాచబలగ నాయకుడు వసంతను పరిణయ మాడుటకై యనేక ప్రయత్నముల జేయుచుండెను. కాని యవన్నియు నిష్ఫలములే యగుచుండెను ప్రతి ప్రయత్నావసానమునందును నాతని కాశా భంగమే కలుగుచుండుటచే నాతనికి కోప మెక్కుడయ్యెను. ఆతడు మోహవారధిలో మునిగిపోయెను.

ఒకనాటిరాత్రి రెండు యామములు గడచినవి. ఆతడొక మందిర మున నొక శయ్యపై గూర్చుండి యుండెను. ఆ మందిరమునకు దక్షిణ మున కవాటమొండుగలదు. అ కవాట ద్వారము దాటిన యంతయు గాఢాంధకారమయమే.

ఈ మందిరములోన మాత్రము నొక దివ్యజ్యోతి వెలుగొందు చుండెను. ఆతనికి నిజముగా యీ వసంతను తీసుకొనివచ్చిన నాట నుండియు మతిభ్రమణము గలిగెను. హృదయమంతయు మోహాంధ కారమగ్నమై యుండెను.

ఆతడా శయ్యపై జరుండి మధ్య మధ్య యెందుకో లేచును. మరల పండుకొనును. మరొకసారి కోపానలజ్వాలలు ముఖమున ప్రజ్వ లింప గుభిల్లున లేచి ఓరీ క్రూరా! మామక సౌఖ్య సంహారా! రామ సింగు హంతకా నిన్నిప్పుడు నా కృపాణమునకు యెరజేసెదను ఇంకెందు పోయెదవు. నెవ్వరి నాశ్రయించెదవు రమ్ము. భయంకర మానవపిశాచ మన నేమనుకొంటివో. అని గర్జించెను.

ఒకమారు వసంతను తలసుకొని వసంతా నన్ను పరిణయ మాడవా? నేను నీ దాసాను దాసుడనుగానా! నన్ను చేపట్టి సుఖింప రాదా యని మోహాంధకార పూరితుడై లేచి వసంతయే సాక్షాత్క రించినట్లుగా భావింప యే స్థంభమునో కౌగలించబోవును. మరల యాశాభంగ మొందినవాడై ఛీ ఛీ యెంత బ్రతిమాలినను నిరాకరించుటయేనా?

ఆ జాగ్రత్త. నా కంఠ్ఠమెకుటనే, నా సౌఖ్య పరిహర్తను, నా బలవద్విరోధిని, యా రామసింగును కౌగలించు కొనుచుంటివా? జాగ్రత్త. మిమ్ముల నిరువురను నా ఖడ్గమునకు బలి యిచ్చి నా పరాభ వాగ్ని కీలిక నిక జల్లార్చుకొందును.

అని తన శయ్యపైనుండి లేచి వసంతయున్న గదిలోనికి బోయెను.

హంతకుడు.—ఓ ప్రియా! వసంతా నన్నిప్పటికైన ప్రేమించితివా? ఏల నా హృదయము శోభించెదవు.

వసంత:—ఛీ దురాత్మా! ప్రియా యని పిలచుటకు నీకు నోరెట్లు వచ్చెను. ఆవలకు బొమ్ము.

హం:—పోవలయునా, రాక్షసీ! నిన్ను నాలుగు దినములనుండి బ్రతిమాలుచుంటినె. కొంతయైన యాలోచింపవలదా? యెవ్వడో రామసింగట వానిని రేపే బోయి నా భీకరఖ డ్గాసి ధారలచె పొడిచి నీకా రక్తము ద్రావించెదను. యెరుగుదువా? యని క్రంద్లెర జేసి భీకరాకారుడై మొలనుండి తళతళలాడు కత్తినిదీసి నన్నిప్పటికైన వరించెదవా లేదా?

వసం:—క్రూరుడా! నా మనోభవుని జంపుదువా చంపకుము. నీకు ఘోరపాపము జుట్టుకొనును. నేను నిన్ను ముమ్మాటికి పరిణయ మాడను. కావలసిన నా ప్రాణముల నిత్తును గైకొనుము.

హంత :—ఇత్తువా నిప్పుడే పరికి వేసెదను జాగ్రత. అనిపయి కెత్తిన కత్తిని మరల వొరలో నుంచి వసంతా! నీకు రెండు దినంబులు గడువిచ్చితిని బాగుగా యోచించుకొనుము నన్ను పరిణయ మాడితివా నీవు బ్రతుకుదువు. లేకున్న నిన్ను చంపక తీరను. అని యనుచుండ లో యెవ్వరో వొక పురుషుడు వచ్చి అయ్యా యిందిర మిమ్ముల బిల్చుచున్నదని చెడలిపోయెను.

ఆ మాట వినినతోడనే హంతకుడు వసంతను విడిచి తన గది లోనికి పోయి తన మంచముపయి పరుండెను

అంతట సేవకుడు వచ్చి అయ్యా మీకొరకయి వొక జ్యోతిష్కుడు ద్వారమువద్ద వేచియున్నాడనెను తక్షణము లోనికి ప్రవేశపెట్టుమని హంతకుడు బదులుచెప్పెను.

వెంటనే మన కపటయోగి లోపలకు వచ్చి యా పాతాళదుర్గ నిర్మాణమునకు యాశ్చెరువందుచు, యన్నియు పరికించుచు నెమ్మదిగా హంతవి చక్రవర్తియున్న సౌధమునకు వచ్చి

అయ్యా నేను బహు పండితుడను. జ్యోస్యము బాగుగా జెప్ప గలను. నన్ను మీరు సన్మానింతురని మీ కడకు వచ్చితి యని పలికెను.

అందులకా క్రూరగాడు తనలో తాను నవ్వుకొని వోహాసీంద్రా మీరు నాకు జ్యోస్యము జెప్పుదురా? అటులయినచో చెప్పుడు యనియెను.

మాయాయోగి మీ చేయి నిటు చాపుడు యని వాని చేయి నందుకొని యిట్లు జెప్పదొడంగెను.

యోగి :— మీ నాయకత్వము కొద్ది రోజులలో నసింపుచేయు టకు మీవారిలో కొందరు కుట్రలు పన్నుచున్నారు. ఆ కుట్రలునశింపు చేయుటకొరకు మీరు నిర్భయముగా ప్రవర్తించుటకు వొక ఘన కార్యము జేయవలయును.

హంత :—అట్లనా ? మా వారిలో నాకు విరోధు లెవరు ?

యోగి :—విరోధులు లేకేమి ఆ వసంతను వా రపహరించి మిమ్ముల నణగ ద్రొక్క దలంచుచున్నారు. వారి పేర్లు కావలెనా ? ఒకడు వీరసింగు రెండవవాడు జగత్ సింగ్

హంత :— అట్లయిన వారలు వచ్చిన వెనుక నా ఖడ్గముచే వారల యమపురికి బంపి నా తపంబు నిశ్శేషంబుగా శమింప జే ఁయుదును.

యోగి :—ఇంకేమి ప్రశ్నలు గావలయును

హంత :—అయ్యా మా వసంత నన్ను పరిణయమాడునా ? ఇది యొక్కటియే జెప్పవలయును.

యోగి :—నీవును కొంచ మోపిక బట్టుము ఆమెను యొక్కువగా నిర్బంధించకుము. అని యేమేమో జెప్పి యా యోగి వెడలిపోయెను.

తరువాత హంతకుడు తనలో తానిట్లు తలపోయజొచ్చెను. ఓహో ! నాకుగూడ విరోధు లేయట. వారిని జంపి నా కోపము తీర్చు కొందమన్న వారు నాకు స్నేహితులుగదా ! ఏమిచేయుదును. సరే యీవిషయము మన యిందిరతో రహస్యముగా నాలోచింపవలయును. అనియనుకొనుచు దిగ్గున లేచి బయల్వెడలి పోయెను.

అట్లు పోయి పోయి యిరువురు పురుషులను పిల్చి యోరీ ! మీరు గోపాలపురము బోయి నచ్చటనున్న గోపీచందును హత్యగావించి నాతని శిరస్సు నిటకు దెచ్చి మిగిలిన యవయవము లన్నియు నొక పేటికయందు భద్రపరచి జాగ్రతగా రామసింగు పడుకొను గదివద్ద పారవేసి రండని జెప్పెను.

౯

సాయంసమయము. ఆకసమునందలి సంజకెంజాయ లుద్యాన వనమున జిగురుకొమ్మలకు కొంత కాంతి నొసంగుచుండెను. పక్షి గణంబులు కిలకిల కూయుచు గుబురుకొమ్మలమాటున నున్న తమ గూండ్లలోనికి పోవ నుంకించుచుండెను.

ఆ సమయమున రామసింగు తనభవనమునకు వెనుకతట్టుననున్న యుద్యానవనములో గూర్చుండెను. అతను నిమీలిత నయనుండై యుండెను. ఆ చల్లని పిల్లవాయువులు కన్నుల పండువగా యానందించు టకు నతనికి యదృష్టము లేకపోయినది.

అతఁ డిప్పుడు యేకాంత స్థలమందు నాసీనుండై యే నవయవ్వన సురూపకళా లలితాంగి, యెవ్వని మనోధనంబు కొరకై తన ప్రాణంబుల నివ్వ సంకల్పించుకొనెనో, యే వనిత తన యవ్యాజాను రాగమును ప్రకటించుచు రహస్యముగా నొక్క వేడినిట్టూర్పు గాల్చుచుండెనో, నా యువతి వసంత కొరకై పలవరించుచు గూర్చుండి యుండెను.

ఆ యుద్యానవనమందు పల్లవకోరక సుమఫల సంభరితంబులైన భూజలతా కుంజపుంజంబులతోను, శుకపిక శారికా నికరకోలాహలంబుల తోను విరాజిల్లుచుండెను.

మన రామసింగు నా వనమధ్యమందు నొక శిలావేదికపై జేరగిలబడి యీ విధముగా చింతిల్లుచుండెను.

హా నా వసంతా! సింగంబు పాలిబడిన కురంగాంగనవలె యీ రాక్షస హంతకుల చేతిలోబడి యేమి కానున్నావోగదా! ఓ లావణ్యరాసీ! నీవు నన్ను మనసార ప్రేమించి యున్నట్లు యీ నా హృదయమే సాక్షి.

నాడా మహోత్సవంబున నాపయి ప్రసరించిన దయారస శీతలంబులును, ఘనమోహానిశితంబులును, నపారంగ ప్రదర్శితంబులును నగు వలపుచూపు లిప్పటికి నా మనఃఫలకమున నాటుకొనియే యున్నవిగదా ఓ నా సౌంధర్య సపద్విలాశ మోహనాంగీ! నీ కుశల ప్రశ్నాపస్తరంబున మోహ సూచకంబులగు నీ విలాస చేష్టలు మయిమరపించుచున్నవిగదా!

ఔరా! నన్నే పరిణయమాడెదనని పట్టుపట్టితివే ఆ కాలకంటక హంతకులు నిన్నెమైన నిర్భంధితురాలిగా జేయుచున్నారా. అట్లయినచో జెప్పుము. వారి నిప్పుడే నా కరవాలంబుచే ఖండ ఖండలుగ నరికి కాకుల గ్రద్దలకు నెగుర వేసెద.

అయ్యో ప్రాణప్రియా! సుకుమార హృదయవగు నీవీ దురదృష్టవంతు నేల కామించితివి ప్రాణేశ్వరీ ఈ యర్ధాయుష్మంతుని కొరకు నీ జీవితమును వ్యర్ధము చేయ దలంచుకొంటివా నే నెచ్చటికయిన పోవ సంకల్పించుకొనునపుడు ప్రియా! మరల నెన్నాళ్ళకు దర్శనమిత్తువో యని కుందుచుండు దానవు. అట్టిదర్శనములు మరల నాకు స్వప్నముల యందు యనుగ్రహించు చుంటివా?

ఆహా! నేనెంత కృతఘ్నుడను. అమూల్యతమంబగు హృదయమును నా కొరకు సంపూర్ణముగ నొసంగిన నిన్ను నేను యెంత నిర్ధయురాలిగా జూచుకొనుచున్నాను.

మదాంధుడైన, కపటక్రియా నిర్వాహణ హంతక దుర్వ్యహుడైన యా నరబలుని చీల్చి చెండాడి వాని గుండెల చర్మము నొలిచిన తరువాతగదా యేమి కానున్నదో జరుగుట. నా కత్తిధాకచే వానిని గజగజలాడించి, నా యత్యద్భుతాపరాధ పరిశోధక బిరుదావళిని లోకమునకు తప్పక చాటుదును.

వసంతా! నీకు యీఘటన ఘటనా సమర్థుడు వయిరి రాజలోక భీకర వీరుండును నగు మన కేశవుడు నాకు దోడుగానుండ చాలదా? అని వొంటరియై యాలోచనా తరంగంబులు పొంగించుకొనుచు బాహ్యప్రపంచకమును చూడకుండగనే భావనా ప్రపంచమున నూగులాడుచు తనలో తాను సమర్థించుకొనుచుండెను.

పాపము! యర్ధరాత్రములో కష్టములోనున్న యాతనిని పలుకరించి ధైర్యము బల్కువా రెవ్వరు? అతడే తాను ధైర్యము తెచ్చుకొనెను.

శశిబింబము యిప్పటి కప్పడే యాకాశ గోళమున నాలుగవ భాగమునందుండి వెలుగుచుండెను. ఆ వెన్నెలలు వసుంధరా దేవికి యలంకరణ మైనవగుటచేత బిందీ యారబోసిన మాదిరిగా గానబడుచుండెను. కొంతతడ వగునరికి రామసింగు లేచి లోనకిబోయి నిద్రించెను.

... ... ... ... ... ...

గోపాలపురపు జనులందరు హంతకుల భయముచే వెన్నెల రాత్రులైనను సాయంత్రము కాగానే యెవరి యిండ్లలో వారు నిద్రించుచుండిరి.

అక్కడ పాతాళదుర్గములో హంతకునిచే పంపబడిన యిరువురు పురుషులు గోపాలపురమునకు నతిశీఘ్ర గమనమున వచ్చుచుండిరి. ఆ తెల్లటి పండువెన్నెలలో యీవ్యక్తులు యిరువురు పూర్తిగా గానుపించుచుండిరి.

అందొకడు ఆజానుబాహుడు. రెండవవాడు సామాన్యుడు. వారిరువురు తెల్లని ముఖమల్ లుంగీలు తలమీదనుండి మోకాళ్ళవరకు గట్టుకొనిరి. చేతిలో యిరువురకును తళతళలాడు కత్తులుగలవు.

ఆ వెన్నెలలో యీ యిరువురు తెల్లదుస్తులు ధరించి నడుచు నప్పుడు యెవ్వరైన పరికించిన వారొక పిశాచ సంభూతులనియే గ్రహింతురు. చీకటులలో నల్లని దుస్తులను, వెన్నెలలో తెలుపుదుస్తులనుధరించిన వారిని పట్టుకొనుట సాధ్యము.

అట్లా వ్యక్తులు యిరువురు వచ్చుచుండగా దారిలోనొక పురుషు డెదురయ్యెను. ఆ పురుషుని దుస్తులు పరికించిన నతడొక రక్షకభటుని వలెతోచును వారలకు యీ క్రింది సంభాషణము జరిగెను.

ఒకడు :—మిత్రమా! ఆ వచ్చుచున్న పోలీసుని చావగొట్టి మనమిచ్చటనుండి కదలవలయును. లేకున్న ముప్పువాటిల్లును.

రెండవ :—అవును వల్లనే.

పోలీసు :—మీ రెవరు ?

1 వాడు :—మేము నరహంతకులము. గోపీచంద్రు భవనము నకు దారియెట్లు ?

పోలీ :—దారియా ? దారిమాట తరువాత చూచుకవచ్చును. ఇప్పుడు రామసింగును, మాధవరావును తీసుకొని వచ్చెదను.

1 వాడు :—తీసుకొని వచ్చెదవా ? నీ విక్కడనుండి కదిలెదవా ? మారు మాటాడితివేని నీ గుండెలో నొక్కపోటు

అని యా హంతకుడు తనకత్తితో నొక్కపోటుపొడిచి పాపాన్ని చెప్పుకొనుము. హంతకుండ నేమనుకొంటివో యనుచు వాని నచ్చటనె యొక వీధి యరుగుపై బడవేసి గోపీచంద్రు భవనమువైపు నకు నడువ మొదలిడిరి.

ఆహా ! ఎంత సాహసము. అంతయు రక్తమయము. అప్పుడే పదిక్షణముల కాలములో పాపము రక్షకభటుని ఘోరబంధనము.

ఔరా ! హంతకులన మానవులవంటి మృత్యుదేవతలు గదా ! వారు నెమ్మదిగా గోపీచంద్రు భవనమున కుత్తరభాగమున నొక గోడ ప్రాకారమువరకు వచ్చిరి.

అది చాల యెత్తైనది. ఆ గోడకు బయట నొక పెద్ద వృక్షము గలదు. ఆ వృక్షము పెద్దదవుటచే శాఖోపశాఖలు గలిగి యా కొమ్మ లన్నియు గోడమీదకే వ్రాలియుండెను.

ఆగోడ యుపతలవైపున నొక దొడ్డిగలదు. ఆ దొడ్డిలోనికి రెండుమూడు కవాటములు గానుపించును. కవాటములు యూడబెరికి గాని పూర్తిగా లోన ప్రవేశించుటకు వీలుండదు.

ఈ హంతకులు యిరువురు యా వృక్షము వద్దకు వచ్చి చెట్టునెక్కి-గోడపైకి వ్రాలియున్న కొమ్మల మీదనుండి చప్పుడు కాకుండా గోడ మీదికి దిగిరి.

తిరువాత యిరువురును రెండు పగ్గములు కొమ్మలమీదనుండి దొడ్డిలోనికి వ్రేలాడదీసిరి వారు త్రాళ్ళగుండా లోనికి జారిరి వారా దొడ్డి ప్రవేశించగనే రెండు కిటికీ కవాటములును వారి భుజబల తార్నములచే యూడబెరికి నొక గది ప్రవేశించిరి.

ఆహా సాహసము. ఆ గదియందు నొక పెద్ద విద్యుద్దీపము ప్రకాశమానమై వెలుగుచుండెను ఆ గదియందు నొక మంచముగలదు వారా మంచముపై గూర్చుండి యేదియో దీర్ఘాలోచన జేయుచుండిరి.

1 వాడు :—మిత్రమా వీరసింగూ! మనము చాల ప్రయాసపడి వచ్చితిమి. మరల నింత ప్రయాస పడిగాని వెలుపలకు పోలేము. గావున మన పనిని మనము తొందరగా నెరవేర్చవలెను.

2 వాడు :—అవునురా జగత్సింహ పాపము యీ రాత్రి యంతయు రక్తపాతమే. నడుమ అధమము నొక లక్షరూపాయల నైనను పట్టుకొందమా?

జగ :—అదియంతయు మన కెందులకు ఈ పనియంతయు వాని చేతనే గావించెదము. తరువాత వాని పని పట్టి మన యేలిక జెప్పినటుల వర్తింతము.

అని వారు లేచి యా గదితలుపు నెమ్మదిగా తెరచిరి. అందులో నొక పందిరిమంచ ముండెను ఆ మంచముపై నొక పురుషుడు నిద్రించుచుండుటగాంచిరి.

ఆత డెవరు? మన గోపీచందుయే. ఈ హంతకులు కత్తుల సిద్ధముగా నుంచుకొని యా మంచమువద్దకు వెళ్ళి నిల్చిరి.

జగ :—ఒరేయి వీడు నిదురపోవుచున్నాడు. మన మనుకొన్నట్లు చేయుదుమా?

వీర :—అటులే చేయుదము.

వా రిరువురు రెండు కత్తులను ధణ ధణ మని మ్రోగించి యామంచమువద్ద నిలిచి గోపీచంద్ యని కేక వేసిరి.

ఆ కేకతో నతడు కండ్లు తెరచి వీరి భయంకరా కారము గాంచి లేవబోవుచుండెను.

ఓరీ లేవకుము. లేచితివా నిన్ను ముక్క ముక్కలుగా తరిగి వేసెదము. నీకు యీనాడు చావు తప్పదు. నీయందు డబ్బునంతయు తెచ్చి మా యెదుట నుంచుము. లేకున్న యివిగో కత్తులు. అని రెండు కృపాణములను జూపి భయపెట్టిరి.

గోపీచందు భయవిహ్వాల చిత్తుడయి నాకు మరణము తప్పదు. ఈ హంతకుల చేతిలో చావవలసివచ్చెగదా యని నోట మాటరాక పడియుండెను.

జగ :—ఏమిరా? లేచి నే జెప్పినట్లు జేయుము ఏమి వినపడుట లేదా. లెమ్ము అని తన వద్దనున్న తోలుకర్రతో పాదలంతయు దెబ్బలు కొట్టెను.

గోపీచందు యా యా దెబ్బల కోర్వలేక అయ్యలారా! ధనమంతయు యీ పెట్టెయందే యున్నది. తీసి యిచ్చెదను.

అని తనకు దగ్గరగ నేయున్న పెట్టె తెరచి యందున్న నోట్లన్నియు తెచ్చి ఓ నరహంతకులారా యివిగో తొంబదివేల రూప్యముల

నోట్లను మీ యధీనము జేసినాను. నన్ను మీ రేమి జేసినను జేయుడు. మీకు యమదండనము శీఘ్రకాలములోననే జరుగగలదు. మీ బోటి క్రూర నిశాచరాధ ... ... ... ... ...

అని యింకను మాట్లాడు చుండగనే వారు యిరువురు చెరి రెండు కత్తులతోను వానిని పొడవసాగిరి. ఆతడు మొదలంటగ నరుకబడి ముక్కలు ముక్కలు క్రింద నరకబడెను.

ఔరా! యెంత ఘోరము అంతయు రక్తపాతము. ఆ గది యంతయు గోపీచందుయొక్క రక్తమాంసపు ముక్కలే. గోపీచందు హత్యముగిసెను. నిమిషకాలములో రెండు హత్యలు జరిగినవి.

వారు గోపీచందు శిరస్సు పట్టుకొని, యా నోట్లపెట్టెను తీసుకొని వచ్చినదారినే యథేచ్ఛగా నిర్గమించిరి

ఆ రక్తపాతముతో భవనమంతయు సూర్యుడులేని దినంబుపగిది తేజవిహీనంబై యుండెను.

ఈ ఘోరహత్యలకు తల్లడిల్లెనో యన్నట్లు సుధాచంద్రుడు కాంతి విహీనంబై నల్లని కారుమబ్బుల చాటున తల వంచుకొని పోవుచుండెను.

... ... ... ... ... ...

ఆ నాటిరాత్రి జరిగిన రక్షకభటాధికారి ఘోరమరణమును, తన మామయగు గోపీచందు దారుణ హత్యయు రామసింగునకు తెలిసెను. రామసింగు యంతయు పరిశీలించెను.

అయ్యో! నా ప్రేయసి వసంత తండ్రి మరణమునకు యెంత చింతిల్లునోగదా యని విచారపడ దొడంగెను. మరల ధైర్య మవలంబించి తాను స్వయముగా ప్రయత్నములు చేయుదొడంగెను.

ఆతడు కర్మాగారము వద్దనున్న పోలీసు శవమును, గోపీచందు శవమును జనార్దనరావునకు జూపించి విచారణ జేసి తగినంత

మానమే తేనందున చిలతిల్లుచు. ధనాప హారణమునకై యొక్కింత తడవు యోచించి కాళ్ల జాల్చుకొని కూర్చుండెను.

అంతలో తలుపువద్ద యెవ్వరో చప్పుడు జేసి రామ్‌జీ యని కేక వేసిరి రామసింగా కేక విని చప్పున తలుపుతెసి తన ప్రియమిత్రుడు కేశవరావు వచ్చుట గాంచి యాశ్చర్య చకితుడయ్యెను.

పాఠక మహాశయులారా! మన కేశవరావు పాతాళదుర్గములో కపటయోగి వేషము ను విడచి తన మిత్రునికొరకు నరసింహేంద్ర పురము యెందుకొరకై వచ్చియున్నాడో మీ రెరుంగుదురా?

ఈతడు యఘటనా ఘటన ధురీణుండని మీ కిదివరకే తెలియ పరచితిమి.

పిదువాత వారు యిట్లు ప్రసంగించుకొనిరి.

రామ:—కేశవా! నీవు యెచ్చటినుండి వచ్చితివి?

కేశ:—నేను పాతాళ దుర్గమునుండియే వచ్చితిని.

రామ:—విశేషము లేమి? వసంతయు యిందిరయు క్షేమమా?

కేశ:—క్షేమములా కేమి కాని నిన్న యా హంతకనాయకుడు యిరుపుర హంతకుల గోపాలపురము బంపి గోపీచందును హత్యజేసి శిరము మాత్రము తీసుకొని రమ్మని బంపినాడు యెరుంగుదువా?

రామ:—యెరుగ కేమి. అప్పుడే యాతని హత్యయు, రక్షక భటుని బంధించుటయు గూడ జరిగినవి. కేశవా! అతడు గోపీచందుని హత్యచేయు టెందులకో

కేశ:—ఎందులకో నీ వెరుంగవు ఆతడు ధనాపేక్ష చేతనా, వసంతకు తండ్రి శిరస్సు జూపి భయపెట్టి యామెను పెండ్లియాడ వలె ననెడి దురుద్దేశము చేతను యట్లొనర్చెను.

రామ:—మిత్రమా! యా దుర్మార్గుడు వసంతను బలాత్కరించు చుండెనా?

కేశ :— ఒకనాడు బలాత్కరించుటకు సిద్ధముగానున్నపుడు నేను పోయి యా దురాత్మగ్నునకు వోరీ నీవు యామెను బలవంత పరచకుము యట్లొనర్చితివేని నీకు ముప్పువాటిల్లగలదు. అని జెప్పి పిరికిమందు వేసితిని. ఇంతలో యిందిర వచ్చి తన దుర్మోహ మేఘపటలిలో ముంచి సారా బుడ్డతో వానిని స్పృహలేకుండ పడవేసినది.

రామ :— కేసవా! గోపాలపురములో హత్యజేయుటకు బంపిన వారిని నీ వెరుంగుదువా వారి పేర్లేమన ?

కేశ :— ఒకడు వీరసింగు రెండవవాడు జగత్ సింగు నేనువారలను మొదటనె చంపునిమిత్త మొక కపటవ్యూహము బన్నితిని. గాని యది నెరవేరలేదు. మన మొక పనిని చేయువలయును.

రామ :— అదియేమో తెలియపరచుము.

కేశ :— నేను వా రిరువురకు కొన్నిరహస్యములు జెప్పి వారి నాయకునితో సింహబలుడును, వీరదాసుచు నరసింహేంద్రపురము కర్మాగారమునుండి రామసింగుచు ధిక్కరించి తప్పించుకొని వచ్చుచున్నారనియు, వారల కొరకయి నీ వద్దనున్న వీరసింగును జగత్ సింగును దుర్గము వెలుపలకు పంపుమనియును జ్యోతిషము జెప్పెదను.

దానికి నాతడు సమ్మతించి వారల నిరువురను బయటకు బంపును. అప్పుడు మరల నేను ప్రచ్ఛన్న వేషుడయి నీ వద్దకు వచ్చెను. మన మిరువురము బంధిలోనున్న వీరదాసు, సింహబలుల వేషము వేసుకొని కత్తులు ధరించి యచ్చటికి బోయి వారల చావమోది బంధీచేయుదము. ఇదయే మంచి యుపాయము.

రామ :— బాగుగాయున్నది. అట్లేచేయుదము వీరసింగు, జగత్ సింగులను బంధించిన మనకు కొంత యుపకార మున్నది. నీవుమాత్రము గోపీచందు శిరమును వసంతకు జూపకమునుపే రహస్యముగా యిందరతో జెప్పిదానిని మాయము చేయించుము. లేకున్న వసంత

మరింత విచార సముద్రములో మునిగిపోవుము.

కేశ :—అట్లె చేయుదును. నేను వారలను నా వలలో పడవేసి నమ్మించెదను. అని వారు వెడలిరి.

## ౧౦

పాతాళదుర్గములో వొక గదియం దొక మంచముపయి యింది రయు హాంతకుడును సంభాషించుకొను చుండిరి.

ఆహా ! స్త్రీ లెంతకయినను వెనుదీయరుగదా ? తన నెచ్చలి ప్రాణ రక్షణార్థము తన శీలమును కాపాడుకొనుచు కపటపు వలపులను నాంతకునిపయి కురిపించుచు, మధ్య మధ్య తన మనోనాధుడగు కపట యోగి వేషమున నున్న కేశవరాతో ప్రసంగించుచు, వసంతను వేయికండ్లతో గాంచుచు, నిద్రాహారంబులు పరిత్యజించి కర్తవ్య మూహించుటకు ప్రయత్నములు సలుపుచుండెను.

ఆనాడు యిందిర కొంచెము కోపభూయిష్ఠయయి యుండెను.

హాంతకుడు :—ప్రియా ! ఈనాడు యేమియో నాలోచించు చుంటివే.

ఇందిర :—ఏమున్నది. నే జెప్పినట్లు చెరించితివా మంచిదే లేక నా మాట ద్రోచిపుచ్చితివా యేమి జరుగనున్నదో.

హాంత :—ఆ మాట యేదియో యిప్పుడు కొంచము జెప్పుము.

ఇంది :—జెప్పుదేనా ? నన్ను ప్రేమించుచుండి యింకొకతెను దగ్గర పెట్టుకున్నచో నా కేమియు బాగుండినది కాదు.

హాంత :—ఇంకొకతె యెవరు ?

ఇంది :—సహసంశ కాదా ?

హంత :—అయినచో యామెను తప్పక విడిచిపెట్టవలయునా? ఈనాడు మాత్రము ప్రయత్నించి జూచెదను. లొంగకున్నచో సరే కానిమ్ము ఏమి జరుగునో యప్పుడే చూడగలము.

ఇంది :—ఏమి జరుగును. నీవు గొప్ప బలవంతుడవని విర్రవీగు చున్నావు.

హంత:—దానికేమిగాని. ఇందిరా! నిన్నను నా సేవకులనుబంపి గోపీచందును హత్యజేయించి వాని శిరము నిచ్చుటకు తెప్పించితిని.

ఇంది :—ఆహా! ఎంత ఘోరము. మహాపాపము. ఒకమానవుని జీవితుడుగా నున్నప్పుడే బలవన్మరణము పొందించిన యెంత మహా పాతకము. శిరము నెందులకు తెప్పించితివి.

హంత :—ఎందులకో జెప్పెదను.

అని యేదో కొంత పనిమీద లోనికి పోయెను. వీ రిరువురి సంభాషణమును మన కపటయోగి ప్రక్క గవాక్షపు తలుపుల చాటున నుంచి వినుచుండెను.

ఆతడు యిందిరను జూచి ప్రేయసీ! ఇందిరా! యని పిలచెను. వెంటనే యిందిర తన నిజవల్లభుని కేకవిని యాశ్చర్య భీతస్వాంతయై ప్రియా యెంతసేపటినుంచి మీ రిక్కడ నుంటిరి యని యడిగెను.

యోగి :—ఇందిరా! మీ మీ సంభాషణము నంతయు వీనులార వింటిని. నీ భావనా చమత్కృతికి యెంతయు మెచ్చితిని. కాని ప్రియా! నేనొక మాట జెప్పెదను. తప్పక నెరవేర్చెదవా?

ఇంది :—మీరు జెప్పుటయు నే నుల్లంఘించుటయునా? యెంతమాట.

యోగి :—అట్లయిన జెప్పెద వినుము. ఇప్పుడు హంతకుడు గోపీచందు శిరము నీకు జూపుటకు తెచ్చును. తేగానె నీవు వానిని

మందమతిగా నొనరించి యా శిరస్సు నెచ్చటనో దాచి యుంచుము. లేకున్న హంతకుడు యా శిరస్సు వసంతకు జూపి భయపెట్టును. అది జూచినవెంటనే యామె తప్పక ప్రాణత్యాగము జేసికొనును. అందుచే నీవిందు పాల్గొనవలయును.

ఇంది :—నాథా! నే నెల్లప్పుడును మిమ్ముల ననుసరించు దాననెగదా! అట్లె యొనర్చెదను. ఆ దుర్మార్గుడు వచ్చువేళ యైనది. కాన మీరు వెడలుడు.

అనినతోడనే యా యోగి వెడలెను. మరికొంత సేపటికి నా హంతకుడు వొక ఛురె చేతితో పట్టుకొని యిందిర పడుకొనియున్న మంచముకడకు వచ్చెను.

ఇందిరా చూచితివా గోపీచందు శిరము అనెను. ఆమె యా శిరము జూచినతోడనే భయస్వాంతయై కొంతవడికి ధైర్యము దెచ్చుకొని ప్రియా మీకు సారాయమునకు వేళయైనది. అని లోపలికి పోయి అయిదారు సారాబుడ్లను తెచ్చి వొకబుడ్డి యాతని కిచ్చెను.

ఆ దుర్మార్గుడును చేతనున్న శిరమును వొక బల్లపైనుంచి యా సారాయమును గ్రోలెను.

ఇందిరయు వొక డొకటిగా బుడ్లన్నియు నాతనిచే ద్రావించెను. కొంతసేపటికి యాతడు వూగులాడుచు యొడ లెరుంగక యా చానడి యంతయు చిందులిడుచు మోహాంధకారమున కనుగానక యామెపై బలవంతముగా పడబోయెను.

ఆమెయు భీతస్వాంతయై వెర వూహించుటకై ప్రయత్నించుచుండెను.

ఆ దుర్మార్గుడు మన యిందిరను బలిమిని బట్ట సాహసించి కండ్లెర్ర జేసి యామె శిరోజములను బట్టుకొని కౌగలింప నుద్యుక్తుడయ్యెను.

ఆమె కోపపరీత భూతస్వాంతయై యేమియు దోచక మొలనుండి ఖయిజారుతీసి యామెను శీలభంగ మొనర్ప సంసిద్ధుడైయున్న హంతకుని పొడువబోయెను.

అంతలో వెనుకనుండి వొక పురుషుడు యిందిర చేయి పట్టుకొని ఛీ పాపీ! [రా]జునే కపటోద్యోగముచే చంప నెంచితివా? నిన్ను నా ఖడ్గము[నకు] బలిగానిచ్చి నా భక్తి నిలుపుకొందును. అని యరచెను.

ఇందిర నివ్వెరపడి వోరీ దురాత్మా నీ[వెవ]డవు.

నేను దుర్మ్ముఖుడను. ఇంటిసొమ్ము దిని వాసములు లెక్కపెట్టె నన్నట్లు నమ్మించి మద్యపానా సక్తునిగా నున్నపుడే చంప సాహసించితివా? నిన్నిప్పు డేమిచేసెదనో చూడుము.

అని యా దుర్మ్ముఖుడు యిందిరను క్రింద బడవైచి తన కత్తితో పొడువబోయెను.

అంతట యిందిర యేమియు దోచక కొంతవడికి ధైర్యము దెచ్చుకొని తన కేలనున్న ఖైజారుతో యా దుర్మ్ముఖుని గుండెలలో నొక్కపోటు పొడిచెను.

దానితో దుధిరమునుండి యా క్రూర దుర్మ్ముఖుని రక్తప్రవాహ ములు ప్రవహించుచుండెను.

ఔరా! స్త్రీసాహస మెంత సాహసము. అంతయు రక్తమయము ఇందిర దుస్తులు రక్తముచే నిండిపోయెను.

మన యిందిర వానిని పొడిచిన తరువాత యొక కపట వ్యూహము బన్నియుంచెను.

ఆమె వెంటనే మూర్ఛబడియున్న హంతకుని ప్రియా ప్రియా యని లేపెను.

హంతకునకు స్పృహవచ్చి కనులువిప్పి యిందిరను జూచి యీ రక్తమేమి యీ భయంకర స్వరూపమేమి? యని కంగారుపడుచు యడిగెను.

ప్రియా ! జూచితివా ! యీ దుర్ముఖుని పొగరు. మీరు వానిని యెక్కువగా పొగడుచున్నందులకా నన్నిట్లు బాధపెట్టినది. అని యాతనిని దుర్ముఖుడు పడియున్న చోటునకు దీసికొనివెళ్లెను.

హంత :— ప్రియా ! వీడు నా స్నేహితుడు. వీడు నన్నేమైన బలాత్కరించెనా ?

ఇంది :— బలాత్కరించుటయేగాదు. నేను సమ్మతించనందున నన్ను క్రింద బడవేసి కత్తితో నరుకుటకు సంసిద్ధుడయ్యెను. నా ప్రాణ రక్షణార్థమై నే నిట్లుజేసితిని. నా యందేమి పాపమున్నది.

ప్రియా ! నేను మిమ్ములను ప్రేమించినందులకా నన్ను యిన్ని యిడుమల పెట్టుచుంటిరి అని యేడ్వదొడంగెను.

హంత :— ఇందిరా ! నీవు మంచిపని జేసితివి. నా శౌర్య ప్రతాపము లెరెంగక నే వలచినదానినే నాతడు చంప సాహసించెనా. వానిని ముక్కముక్కలుగ నరికివేసినను పాపమున్నదా ?

ఈ వోదార్పు మాటలకు యిందిర సంతసించెను. మరికొంత సేపటికి యిందిర తన రక్తకంచుకముల దీసివేసి మంచెదుస్తులుధరించికొని వానితోగలసి వెడలెను.

... ... ... ... ... ...

మన కపటయోగి వేషమున నున్న కేశవరావు యిందిరతో మాట్లాడిన తరువాత తిన్నగా చావడిగోడ ప్రక్కనుండి పోవుచుండగా నాతనికొక కాగిత మగుపించెను.

ఆత డద్దానినితీసి తన జేబునందు భద్రము జేసుకొని వీరసింగు జగత్‌సింగులున్న దెసకు పోవుచుండెను. ఆతడట్లు పోయిపోయి తిన్నగా నొక యింటి గుమ్మముకడ నిలచెను.

ఆ గుమ్మమువద్ద నొక సేవకుడు కావలి గాయుచుండెను. ఆ పాతాళదుర్గములో నాతని నెరుంగనివా రెవ్వరును లేరు. ఈ యోగిని ప్రతి మనుజుడును నతి భక్తితో పూజించుచుండిరి. కేశవరావు యీ గుమ్మమువద్ద నాగి సేవకునివద్దనుంచి సమ్మతిపత్రము గైకొని లోనికిపోయెను.

ఆయిల్లు యంత పెద్దది కాకపోయినను రెండు చావడులును, యొక గదియు గలదు.

ఆతడు లోనికి పోవుచుండగనే ముందునుంచి యొక పురుషుడు వచ్చి యాతనిని జూచి నమస్కరించి లోనికి గొంపోయెను. లోన నొక మంచముపై యిరువురు పురుషులు గూర్చొనియుండిరి. వారిరువురు యోగిని గౌరవించి వానితో నిట్లు ప్రసంగించిరి.

ఒకడు :— యోగిచంద్రమా! విశేషము లేమైన నున్నవా?

యోగి : — లేకేమి బిడ్డలారా! మొన్నను నరసింహేంద్ర పురము కర్మాగారములో బంధీయైన వీరదాసు, సింహాబలులు యిరువురును రామసింగు కండ్లలో కారముజల్లి బయలుదేరి వచ్చుచున్నారు. మిమ్ములను వారు యీయుద్ధములతో యెదురువచ్చిన ట్లౌనర్పుమని నాతో జెప్పిరి. ఇదియే ముఖ్యకారణము.

రెండ :— యోగీశ్వరా! సంతోషము. ప్రియమైన సందేశమును బుత్తెంచిరి. ఆ రామసింగును యెప్పటికైనను నురుమాడకుండుదునా?

యోగి :— బిడ్డా నీ వంతటివాడవే యగుదువు. నే జెప్పిన సంగతికి సమ్మతించిరా? ఈ పని మీ రొనర్చిన మీ యేలికకు మీ యిరువురి పైనను గౌరవము మెండుగా యుండును.

వా రిరువురును మరికొంతసేపు మాట్లాడుకొని గురూజీ ? తమరు జెప్పినటులే యొనర్చెదము. మే మిరువురమును కొంచము పనిపై కాళీపట్నము పోవలయును. ఆ వీరసింగు సింహాబలుల నిరువురను నచ్చుటకి రమ్మని జెప్పెదరా ?

యోగి :—జగత్ సింగూ ! మీకు కాళీపట్నములో నున్న పని యేమి ?

జగ :—పనియా ? మీరు మాకు గురువులు గనుక విప్పి జెప్పెదను. అచ్చట నొక యువతిగలదు ఆమె పేరు సుశీల. ఆమెతో కొన్ని రహస్యములు చర్చించుట కొరకై పోవలెను.

యోగి :—అట్లయిన మంచిదే. వారితో నేను కలసి మాట్లాడెదను. నాకును యాలస్య మగుచున్నది. శీఘ్రకాలమున పోవలయును.

ఇరువురును పోయిరండని యోగిని సాగనంపి, వారు లోనికిపోయి తలుపులు వేసుకొనిరి.

మన కపటయోగియు పన్నిన పన్నాగమునకు లోలోన సంతసించుచు, కాళీపట్నంలో యున్న చక్రబలగపు రాణినిగురించిన విషయము లేమియో తెలిసికొన కుతూహలుడై వడివడిగ ప్రయాణము సలుపుచుండెను.



౧౧

కేశవరావు పాతాళ దుర్గములోనుండి బయలుదేరి తిన్నగా నరసింహేంద్రపురము కర్మాగారము వద్దకు వచ్చెను. కేశవరావు వచ్చునరికి కర్మాగారములో జనార్దనరావు, మాధవరావు, రామసింగు మాట్లాడుకొనుచుండిరి

వారు కేశవునిజూచి మిత్రమా వచ్చితివా యని పలుకరించి అతనిని కూర్చుండ నియమించి తరువాత కుశలప్రశ్న లడుగజొచ్చిరి.

జనా :— కేశవా ! విశేషములేమి ?

రామ :—మిత్రమా ! నీవు పన్నిన పన్నాగము నెరవేరినదా ?

కేశ :— నెరవేరినదని జరిగిన యావద్వృత్తాంతము వారితో విపులముగా జెప్పి, యింకను యేమేమియో జెప్పుచు మిత్రమా ! యీ ఉత్తరమును చదువుమని రామసింగు చేతికొక లేఖనిచ్చెను. ఆ లేఖను యీ క్రింది విధముగా చదివిరి.

చక్రబలగవు రాణికి · కాళీపట్నం

పిశాచబలగ నాయకుడు వ్రాయునది—

ప్రియా ! రేపు నీవద్దకు వీరసింగు జగత్ సింగుల నిరువురను బంపుచున్నాను. నీ యిచ్చవచ్చిన రహస్యములు వారితో జెప్పుము. యెట్లయినను నీవు యీ రామసింగు ప్రభృతుల చంపు ప్రయత్నముల జేయుచుండుము. అప్పుడుగాని వసంత మనకు లభింపదు. నీ చాకచక్యము యీ పత్తేదారు డింతవరకు చవిచూచి యెరుంగడు. నేనింత వరకు నీ సాయ మపేక్షింపలేదు. కావున నీవు జాగ్రతగా చరించుము.

పాతాళదుర్గము.

వారా యుత్తరమును చదివి నాశ్చర్య చకితులైరి.

రామసింగు :—మిత్రులారా! యింకొక హంతకురాలుకూడ కాళీపట్నంలో గలదట. చక్రబలగపు రాణియట. ఆ దుర్మార్గుడు యామె సహాయము తీసుకొని మనలను చంప యత్నించుచున్నాడు.

కేశ :—రామ్‌జీ! మనము ముందు యిప్పటికేపోయి వారిరువురి పని పట్టవలయును.

రామ :—మాధవా! మీరుమాత్రము కడు జాగరూకులై యుండుడు. రక్షక భటులను నియమిత స్థలములం దుండునట్లు యేర్పాట్లు జేయుడు. గోపాలపురము విషయమై గూడ తగు జాగ్రత్త తీసుకొనుచుండవలెను. నేను మదనపురము రేపు సాయంకాలము కాళీపట్నము పోయి యామె నొకమారు పరికించి యా దుండగీడులను పట్టి నా హంతకురాలియొక్క నిజవృత్తాంత మరసివచ్చెదను ఆలసించినచో కార్యములు మితిమీరుచున్నవి.

జనా :—రామ్‌జీ! అట్లే చేయుడు. మేమింక వెడలిపోవుదుము. కాల మతిక్రమించుచున్నది.

అని వారు సంభాషించుకొనుచు కర్మాగారము మూసివేసి బయటకు వచ్చిరి. అప్పటికప్పుడే పదునొకండు గంటలు కావచ్చెను. మార్తాండుడు తీక్ష్ణ కిరణములు వసుంధరా వలయముపై ప్రసరింప జేయుచుండెను.

అంతట నొక పురుషుడు తలమీద నొక పేటిక ధరించుకొని వారికడకు వచ్చి అయ్యా దీనిని నొక పురుషుడు మీకు యివ్వమనినాడని జెప్పి దానిని రామసింగున కిచ్చి యాతడు వెడలిపోయెను.

అంతట వారు దానిని కర్మాగారము లోనికి గొనిపోయి యా పేటికను తెరచి జూచిరి.

ఆహా యేమున్నది. చిత్రవధ. మాంసపు ముక్కలు. క్రూరహత్య. ఆ పెట్టెలోనున్న వన్నియు ఘోరహత్య గావింపబడిన నరశరీరమే. రామసింగు యా ముక్కలను బాగుగా పరీక్షించెను.

రామ :—మాధవా! యిదియొక స్త్రీ శవము ఈ మాంసపు ముక్కలన్నియు యాడుదానివే కావలయును.

మాధ :—రామ్‌జీ! ఆఁడదియని నీ వెట్లు నిరూపింపగలవు.

రామ :—నిరూపించుట కేమున్నది. తెలియుటలేదా యని యొక క్రమముక్కతో యొక మాంసపు ముక్కను పైకి యెత్తెను. అందొక ముక్కకు దీర్ఘములైన శిరోజములు వ్రేలాడుచుండెను. మాధవా! జూచితివా యీమె స్త్రీయేనా?

మాధ :—అవును నీవు జెప్పిన దంతయు యదార్థమే. కాని మిత్రమా! ఈమె యెప్పుడు హత్యచేయబడి యుండును.

రామ :—ఈ హత్య నిన్ననే గావింపబడి యుండును. సరియే దీని కేమిగాని మనము కబురుపంపిన సేవకుడు వచ్చుచున్నాడా?

అని యనుచుండగనే యొక రక్షకభటాధికారి పేటికను గొని వచ్చిన గంగాధరు డనువానిని తీసికొని యాఫీసు గుమ్మమువద్ద నిలువ బెట్టెను.

అంతట మాధవరావు రామ్‌జీ! గంగాధరుడు వచ్చినాడు. వాని వాగ్మూలము తీసుకొనుటకై లోన ప్రవేశ పెట్టమనెదవా యని యడిగెను. రామసింగు యందులకై సమ్మతించెను.

ఆ గంగాధరుండనువాడు లోనను వచ్చి రామసింగునకు నమస్కరించి యొకప్రక్క నిలువబడెను.

ఆ పేటికలోనున్న శవపుముక్కల సంగతి రక్షకభటు లందరు వారివారి పనులను విడచిపెట్టి యీ గంగాధరుని వాగ్మూలము వినుటకై కనిపెట్టుక నుండిరి.

కొంత తడవైన పిమ్మట రామసింగు యా పేటికను గొనివచ్చిన వానిని యీ క్రింది విధముగా ప్రశ్నించెను.

రామ :—ఓ గంగాధరుడా! నీ వెచ్చటినుండి యీ పేటికను గొనివచ్చితివి?

గంగా :—అయ్యా! నేను బజారులో యుండగా యొక మనిషి కంగారుగా వచ్చి యేమోయి యీ పెట్టెను కర్మాగారమువద్ద నప్పగించి రమ్ము నీకు రెండణాలు యిచ్చెదనని యీపెట్టెను నా నెత్తిపై బెట్టినాడు.

అంతట నేను అయ్యా, యీ పెట్టె చాల బరువుగా యున్నది. ఇంకొక అణా యిప్పించెదరా లేకున్న నేను యంతవరకు మోయజాలనని బదులు జెప్పితిని.

అందుల కాతడు సమ్మతించి జేబునుండి మూడు యణాలను తీసి నా చేతిలో బెట్టి యాతడు వెడలిపోయినాడు. జరిగిన సంగతి యిది. నమ్ముడు. నమ్మకపోండు. అని తన జేబునుండి మూడు అణాలను తీసి రామసింగునకు జూపించెను.

రామ :—గంగాధరా! నిన్ను నేను మూడుసంవత్సరములనుండి యెరుగుదును. నీవు మంచివాడవను సంగతి నాకును తెలియును. నీవీ యూరు వచ్చి యెంతకాల మైనది?

గంగా :—అయ్యా నేనీ యూరువచ్చి యారుమాసము లైనవి.

రామ :—సరియేగాని నీవు యింతక్రితము పేటికను నీ నెత్తిపై కెత్తిన వ్యక్తిని బాగుగ గుర్తించితివా? వాడు ధరించిన దుస్తులను గురించి కొంచెము జెప్పుము.

గంగా :—ఆ వ్యక్తి పొడుగాటి లుంగీని ధరించినాడు. వాని యాకారము చాల గంభీరముగ నుండును. కోరచూపులు, బుగ్గ మీసములు గలవాడు. ఆ పురుషుడు సుమారు ఆరు యడుగులుండును.

రామ :—గంగాధరా! నీవు యెప్పుడైన మరల యాతనిని గుర్తించగలవా?

గంగా :—అయ్యా ఆ సంగతి యిప్పుడు నేను చెప్పగలను.

రామ :—సరియే. నీవు వెళ్లవచ్చును. కేశవరావ్జీ! యీ గంగాధరుని బంపివేయుము.

రామసింగు యాజ్ఞ యయినతోడనే గంగాధరుడు వెడలిపోయెను రక్షకభటులందరు యథేచ్ఛం జనిరి.

మాధ :—రామ్జీ! ఈనాడు చాల యాలస్యమైనది. ఇక పోవుదము?

రామ :—మిత్రులారా! అట్లె నడువుడు. మీరు జాగరూకులై ప్రవర్తింప వలెనుసుండీ. ఆ వీరసింగు, జగత్సింగుల కొరకై రేపు సాయంకాలము వెళ్లెదము. బంధీతోయున్న వీరదాసు, సింహాబలులను జాగ్రతగా పరికించుచుండుడు. మీరు కడు జాగ్రతగా మసలవలయును సుమా యని వారలకు జెప్పెను.

తరువాత వారు యెవరి నియమిత గ్రామంబులకు వారు వెడలి పోయిరి.

... ... ... ... ... ...

కర్మాగారములో రామసింగు ప్రభృతులచే పట్టుబడిన సింహబలుడు యొకనాడు గదిలో యొంటరిగా నాసీనుడై తనలో తానిట్లు తర్కించుకొన దొడంగెను.

ఆహా! కారాగార మనుభవించుట దుస్సహము గదా! నా చేతిలోబడి మలమల మాడిపోయిన ప్రజా మిడుతలెన్నియుండెనో.

ఔరా! యీ రామసింగు యనిన హంతకుల ప్రక్కలోని బల్లెమై వెలుగొందు చున్నాడుగదా! నేనన్న మా యేలికయగు పిశాచ బలగ నాయకునకు, యతని రాణియగు సుశీలకు యెంత యభిమానమున్నది.

నేను వారిని సంతోషపెట్టి యెన్ని క్రూరహత్యలలో విజయ పత్రములను గొంటిని. నేను కాళీపట్నము వెళ్లిన మా సుశీల నన్ను నెత్తిపై బెట్టుకొనును.

కపట దుర్యోగముచే నన్ను మాయ జేసి పట్టుకొని బంధీజేసిన యీ రామసింగు హంతకుని యెంతని దూరవలయును. ఎట్లయినను ఈనాడు నా శక్తి సామర్థ్యములు వుపయోగించి తప్పించుకొన జూచెదను. నా మిత్రులగు వీరసింగు, జగత్‌సింగులతో కలసి ఈ నిరూపకుని గర్వమడంప సమకట్టెదను. వీడు సింహాబలుడని వా డెరుగడు కాబోలు. నా బల మిప్పుడే ఈ రోజుననే వాని సమక్షమున ప్రదర్శించెద నని పని పలువిధంబుల కారాగార విముక్తి కొరకై తనలో తాను యాలోచించి కొనుచుండెను.

౧౨

ఆహా! హృదయ కమలమందు భావము ముకుళించి లగ్నమగు చుండును. ఆ హృదయాంత ర్భాగమునసే పరమేశ్వరుడు మాయా మానుష లీలా విగ్రహుడై వెలుగొందుచున్నాడు ఆ భావము క్షణ క్షణమునకు ఎంత వికారరూపములు దాల్చుచుండును. భావము నం దిట్టి యత్యద్భుత రూపమే లేనియెడల యిప్పుడు మన రామసింగు హృదయము వివిధ వికార సంచలిత పరిస్వాంత ప్రదీప్తిత మెట్లగు చుండినది?

రామసింగు యిప్పు డెచ్చటనున్నాడు? దేహపరిశ్రమాగారమున లేడు. రహస్య కార్యాలోచనా మందిరాంగణమున దిరుగుట లేదు. శత్రుకార్య పరతంత్రా న్వేషణంబున ప్రత్యాలోచనముం జేయుట లేదు. మరి యాత డేమి జేయుచున్నాడు.

సముదయ సుగంధంబు విసరుచోట, నానావిధ విహంగ విలసిత యోగ్యంబగుచోట యాసీనుడై త్రిలోకైక సుందరియైన, సకలలోక ప్రజాభినంద్య కళారూప శోభితాంగియైన వసంత కొరకై విచారించు చుండెను.

అంతట కేశవరావు యక్కడకు వచ్చి మిత్రమా! ఏమి యాలోచించుచుంటివి యని యడిగెను.

రామ:—వచ్చితివా? ఆలోచించుటకేమున్నది. మనము నిన్న యనుకొన్న చోటికి పోవుటకు సిద్ధులమేగదా!

కేశ:—నే నెల్లప్పుడును నీ మాటకు వ్యతిరేక మాడువాడను గాను మన సేవకులచే యశ్వముల సిద్ధము జేయించితిని. అవిగూడ యచ్చటనేయున్నవి.

అట్లయిన మనము వెంటనే పోవలయునని వా రిరువురు మారు వేషములు ధరించుకొని అశ్వారూఢులై కాళీపట్టణమువైపు పోవదొడంగిరి

వారు రాత్రి పండ్రెండు గంట లగుసరికి కాళీపట్టణము జేరుకొనిరి. అక్కడ వారు యశ్వములడిగ్గి వాటిని చెట్టునకు కట్టిపెట్టి దగ్గరనేయున్న యొక భవనము వైపునకు మరలి పోవుచుండిరి.

ఆ పట్టణవాసు లందరు గాఢముగా గుండెలపై జేతులవైచుకొని నిద్రించుచుండిరి.

రామ్‌జీ కేశవులు యొక భవనముగొడ్డకు వచ్చి యక్కడ యాగి వారిల్లో వారు నెమ్మదిగా మాట్లాడుకొనుచుండిరి.

రామ : మిత్రమా! యీ భవనము హంతకునిదియే.

కేశ :—లోనికి పోవుదమా ?

సమయము —కాలిచప్పుడు—అలికిడి—మోసము—జగత్—బంధనమైన పిదప—సుశీల—ప్రతాపము—పిశాచ జ్వాలలు—కాదు కాదు—స్త్రీ జ్వాలలు—నా ప్రతాపంపు తరుణము—మిత్రమా—ఒక్క యడుగు—నీ వెనుక నేను—భవనము—పరీక్షింపవలయును—కాదా—గాగలదు—కండక్రొవ్వు—తప్పదు—జాగ్రతసుమీ—నడువుము.

వారట్లు భవనము ప్రవేశించి లోనున్న చావడిలోనికి వచ్చిరి. అక్కడ రెండు గదులుగలవు. మనవారిద్దరు యా రెండు గదులలోనికి పోయి యంతయు శోధించిరి. అచ్చట యేమియును లేదు.

అందొక గదినుండి పెద్దమార్గ మగపడుచున్నది రామసింగు కేశవులు యా భవన నిర్మాణమునకు యచ్చెరువందుచు యచ్చోటికి బోయిరి.

అచ్చట ద్వారము మాయబడి యుండుటచే యచ్చటనుంచి దారియెట్లో వారికేమియు గోచరమగుట లేదు. వారట్లు కొంతసేపు యాలోచించి యా గోడనంతటను పరిశీలించిరి.

ఆ గోడకు నాలుగు మేకులు దగ్గర దగ్గరగా యమర్పబడి యుండెను. రామసింగు యా మేకులగాంచి విద్యుద్దీపపు కాంతిచే బాగుగ పరిశీలించి యందున నొక మేకును లాగెను.

లాగిన వెంటనే పెద్దచప్పు డయ్యెను. మరికొంత సేపటికి పైనుంచి యినుపకమ్మి యొకటి క్రిందకు జారెను. అది రెండడుగుల వెడల్పు యడుగున్నర పొడుగును గలది.

రామసింగు దానిని గాంచి యిది పై యంతస్థునకు పోవుటకు సూచన గావలయునని తలంచి మరల నింకొక మేకును లాగెను.

లాగిన వెంటనే వెనుకటివలెనె యింకొక యినుపకమ్మి క్రిందకు వచ్చెను.

రామ :—మిత్రవరా ! ఈ నాలుగు మేకులును నలుగురు మనుష్యులకొరకై నిర్మింపించిరి. మన మిప్పుడు రెండు మేకులు లాగితిమి. మన మిరువురము పైకిబోవుటకు మార్గ మేర్పడినది.

అని వా రిరువురు చెరియొక కమ్మిపై గూరుచుండిరి. వారు యాసీనులైన వెనువెంటనె జుమ్ము జుమ్మని రెండును పైకిపోయెను.

పైన యంతయు విశాలమగు హాలు. వా రా హాలు నంతయు కలయదిరుగుచు ప్రతి వస్తువును పరికించుచుండిరి.

అట్లు వారు తిన్నగా నొక గది ద్వారముకడకు వెళ్లిరి. లోనుండి మాటల చప్పుడు వినవచ్చుచుండెను.

అంతట మన రామసింగు కేశవులు తలుపు రంధ్రముగుండా జూడ లోన యిరువురు పురుషులు, స్త్రీయు మాట్లాడుట వీరికి గన్పట్టెను. ఒకడు వీరసింగు, రెండవవాడు జగత్ సింగనియు యామెయే హంతకుని రాణియగు సుశీలయని వారు గ్రహించి యచ్చటనె నిలువబడి వారలు జెప్పుకొనుచుండిన మాటలు యిట్లు వినుచుండిరి.

జగత్ సింగు :—అమ్మా సుశీలా! యింకను మన వీరదాసు సింహబలుల రాకయే గాన్పించుటలేదు.

సుశీల :—జగత్ సింగూ! వోపికపట్టుము. అవును గాని వసంత నాయకుని పెండ్లియాడుటకు సమ్మతించ లేదట? యెట్లు సమ్మతించును. ఆ రామసింగును హంత మొందించినగాని యామె వప్పుకొనదు.

వీరసింగు : - మన నాయకుడు గూడ వసంతను భయపెట్టు చుండును. కాని నాని ప్రయత్నము లన్నియు విఫలము లగుచున్నవి. ఆ యిందిరయే పాడుచేయుచున్నది.

సుశీల :—అట్లయిన రేపు నేను బోయి యా యిందిరను సాగనంపి వసంతను బలవంతముగా వానికి యప్పగించెదను. అప్పుడును వినదా? అంతటితో రామసింగు పనియు ముగియును.

జగ :—ఆ యిందిర యొక వేళ ఏ పని యెడల యేమిచేయుదువు.

సుశీ :—యేమిచేయుదునా? నా జ్వాలల రుచిచూపింతును.

వీర :—ఆమెను మన నాయకుడు జంపనిచ్చునా? వానికి యామెపై నెంతయో మక్కువ.

సుశీ :—అట్లనా? ఆ మక్కువ లన్నియు నాకు పనికిరావు. రహస్యాగారములో యామెను బలవంతముగా వధింతును.

అంతట తలుపుకడ చప్పుడయ్యెను లోనున్న సుశీల ప్రభృతులు వీరదాసు సింహబలులు వచ్చిరనుకొని పాపము తలుపు దెరచిరి.

సమయము కనిపెట్టి రామసింగు కేశవులు రివాల్వరులను ఢాంఢాం మని ప్రేల్చిరి.

జగత్ సింగు, వీరసింగులు యేదియో ప్రమాదము సంభవించిన దని తలంచి వారిపై కలబడిరి.

రామసింగు జగత్ సింగును, కేశవుడు వీరసింగును పట్టుకొని ఘోరముగా పోరదొడంగిరి.

లోనున్న సుశీల యిదియే సమయమని తన మొలనున్న కైజారు తీసి పైనున్నవాడు రామసింగనుకొని జగత్ సింగు గుండెలలో నొక్కపోటు పొడిచెను.

హా చచ్చితి చచ్చితి నని జగత్ సింగు మరణకాల కంఠస్వరము యీమె వీనుల సోకెను.

ఔరా యెంతపని జరిగినదని తలంచి యామె వొక మీటను నొక్కెను. వెంటనె పెద్ద పెద్ద మంటలు జ్వాలలక్రింద బయలుదేరెను. వారు యామె బరికి వెళ్లుట కశక్యముగా నుండెను.

రామసింగు కేశవులు వీరసింగును బంధించి, యేమిచేయుటకును దోపక వారు అయిదారు రివాల్వరు గుండ్లను ఢాంఢాం మని ప్రేల్చిరి. ఆ గుండ్లు యా స్త్రీ యాకారమును తప్పించుకొని పోయెను.

మరల వారిద్దరొక్కమారుగా ప్రేల్చిరి. కాని లాభము లేక పోయెను. ఆమె యదృశ్యురాలయ్యెను.

ఆహా చిత్రము. భయానకము. యేమి విమజ్వాలలు. యని వారు యాగదియంతయు వెదకి యామె కానరానందున చేయునది లేక వీరసింగుతో సహా యశ్వముల నధిరోహించి వెడలిరి.

౧౩

సాయంకాలమగుటకు యింకను కొంత సేపున్నది సూర్యుడు శాంత తేజుడై యాకాశ పశ్చిమగోళమున చాలదూరమున ప్రయాణము సలుపుచుండెను. పూర్వాభిముఖముగ వెడలుచుండిన యాతని విమలాంశువులు చల్లగ చెట్ల యాకులమీదను, కొమ్మలమీదను బ్రాకుచుండెను. ఆ కారణమున వృక్షము లన్నియు బంగారు నీరానిన యట్లు సువర్ణమయంబులై శోభిల్లుచుండెను.

అట్టి సమయమున నొక చలువరాతి తిన్నెపై గూరుచుండి రామసింగు ప్రభృతులు యిట్లు మాట్లాడుకొనుచుండిరి.

జనార్దనరావు :—రామసింగు కేశవులారా ! నిన్నరాత్రి యొక వింత జరిగినది.

రామ :—ఏమది ?

జనా :—మన కర్మాగారములోనున్న సింహబలుడనువాడు సాహసముజేసి తప్పించుకొని పోవనెంచి యా కిటికీ యూచలను లాగుచుండెనట.

ఇంతలో రక్షకభటులు జూచి నన్నును, మాధవరావును త్వరితముగా వచ్చుటకు రమ్మని కబురుపంపిరి. మే మిరువురము పోయి జూచుసరికి యన్ని యూచలు లాగివేసి బయటపడుటకు సిద్ధముగా నున్నాడు.

అప్పుడు మరల మేము లాఠీలతో నాలుగు ప్రహారముల నిచ్చి రాతిగదిలో పడవేసితిమి. లేకున్న యీపాటి కతడు పలాయనము గావింప వలసినవాడే.

రామ :—ఔరా ! అంతపని జరిగినదా ? ఇప్పుడు వానికి సైదోడుగా యింకొకనిని దీసుకొని వచ్చితిమిగదా ?

మాధ :—వానిపేరేమి ?

రామ :—ఒకనిపేరు జగత్ సింగు వాడు యచ్చటనే చనిపోయి నాడు. రెండవ వానిపేరు వీరసింగు.

మాధ :—అట్లయిన మనము రేపు పాతాళదుర్గమునకు పోవచ్చునుగదా ?

రామ :—తప్పక పోవలయును. ఇరువదిమంది రక్షకభటులతో ముట్టడించవలెను. మన మంత్రమును కడు జాగ్రతతో మెలంగవలెను. రేపటితో యీ పాంతకుని పని ముగియును

అని వారు యేవేవియో మాటలాడుకొని నరసింహేంద్ర పురమునకు వెడలిపోయిరి.

... ... ... ... ... ...

రహస్య మందిరములో యిరువురు వ్యక్తులు సుఖాసీనులై మాట్లాడుకొనుచుండిరి. అందొకతె స్త్రీ రెండవ యాతడు పురుషుడు.

స్త్రీ :—ప్రియా ! తుదకు మన మూహించిన కార్యాలోచనము లన్నియు మంట గలసినవి.

పురు :—అట్లనే. నా బాహుబల శక్తిచేత యెన్నిమారులు రామసింగును వోడింపలేదు.

స్త్రీ :—అవునుగాని యిప్పుడు మన మొకపని జేసిన బాగుండు నని నా యభిప్రాయము.

పురు :—ఆ పనియేమి ?

స్త్రీ :—వసంతను మన కులదేవతయగు కాళికాదేవికి బలి యొసంగిన మనల యామె కరుణించి యీ రామసింగుపనిని తుద ముట్టింప జేయును.

పురు :—అట్లు [illegible] యిందుం దనక విఘ్న మాపాదింపజేయును.

స్త్రీ :—ఇందిర యెవరు ?

పురు :—ఇందిర నాకడ పరిచారిణిగాయున్నది.

స్త్రీ :—ఆమె వచ్చి యెంతకాలమైనది తెలియపర్చగూడదా ?

పురు :— తెలియపర్చ కేమి. దుర్ముఖునిచేత కబురుపంపితినిగాదా యిందిర వచ్చి రెండుమాసములు పూర్తిగా లేదు.

స్త్రీ :—దుర్మ్ముఖుడు నాకడకు రానేలేదు. మరి యేమైనాడు.

పురు :—ఒకనాడు యాతడు యిందిర పైబడ నుంకించినాడట మాన సంరక్షణార్థమై యామె వానిని కైజారుతో పొడిచివేసెను.

స్త్రీ :—ఔరా! యెంతపని జరిగినది. దుర్మ్ముఖుడు యాపాపి చేతిలో వధింపబడినాడా? ప్రియా మీరు యామెను దండింపగూడదా? అటువంటి బలవంతు లందరు పోయినవెనుక మీరొంటిమై యేమిః చేయగలరు.

పురు :— ఆమెను చంపుదమన్న నాకు చేతులాడకున్నవి ఆ పని నీవే గావింపలేవా ? యిందిర చచ్చినచో వసంతను కాళికకు బలి నొసంగి యా రామసింగును యింకొకయాట నాడింపవచ్చును.

స్త్రీ :—అట్లయినచో నొక నిమిషములో రహస్యాగారము లో ప్రవేశించునట్లు యొనర్చి యామెపై విషజ్వాలలు ప్రయోగించి హతమార్చెదను.

పురు :— అట్లె కానిమ్ము. ప్రియా! యిక్కడకు యోగివేషమున వచ్చుచున్నవా డెవ్వడై యుండనోపు.

స్త్రీ :—అతడా రామసింగు మిత్రుడు కేశవరావు. మొన్న నా జ్వాలలు వారికి చవి చూపించితినిగదా! మీరు వాని మాయా జోస్యములో పడుచున్నారు కాబోలును.

పురు :—అవును. ఇప్పుడు కర్తవ్యమేమి ?

స్త్రీ :—ప్రియా! కర్తవ్యమున కేమున్నది. ఆలస్య మెందులకు? మీరు వసంతను క్రూరులచే కాళికాలయముకడకు యీడ్చుకొనిపొండు. వలయు సంబారము లన్నియు యేర్పాటు చేయవలసినదని సేవకున కాజ్ఞయొసంగుడు. నేను రహస్యాగారములో దాగియుండెదను. మీరు యిందిరకు నీతో మాట్లాడవలసిన పనియున్నది ఒకమారు రహస్యాగారములోనికి రావలెనని కబురుబంపి మీరు ససైన్యముతో పోవచ్చును.

నేను యామెను యమపురి కంపి వెంటనే మరలివచ్చెదను. నేను వచ్చువరకు మాత్రము యామెను బలినేయకుడు.

పురు :—నీవు వచ్చువరకును యట్లె యాపి యుంచెదను కావున యింక మన పనులను నిర్వహించుకొనవలయునని వెంటనె సేవకుని బిలచి,

అరే నీవు పోయి యిందిరతో నాయక చక్రవర్తి యొకమారు రహస్యాగారములోనికి రమ్మనినారని జెప్పి, మరి కాళికాలయముకడ యంతయు బాగుచేయించి పదిమంది దుర్మార్గులను యిక్కడకు బంపుము. తలారివాండ్రతో యంతయు జెప్పియుంచుము. నీకు తెలియని దేమున్నది గనుక కడు మెలకువగా మెలంగుము. పొమ్ము. అని సేవకున కాజ్ఞ యొసంగెను.

అంతట సేవకుడు చిత్తమట్లె గావించెదనని జెప్పి సెలవు గైకొని వెడలిపోయెను.

మరల హంతకుడు తన రాణియగు సుశీలకడ సెలవు గైకొని వెడలిపోయెను.

... ... ... ... ... ...

పాపము వసంతను కాళికాదేవికి బలియిచ్చెదరను వార్త పాతాళదుర్గమంతయు వెల్లడియయ్యెను. ఆ చండికా సదనమువద్ద సంభారము లన్నియు సిద్ధపరుపబడెను.

తలారులు కత్తులు తీసుకొని సిద్ధముగానుండిరి. భేరీ భాంకార ధ్వనులు ప్రయోగించిరి. ఈ పిశాచ బలగనాయకుడు పదిమంది క్రూరులతో వసంతకడకు వచ్చి నిలచెను.

వసంత యాక్రూరుని గాంచి భీతచకితమై అయ్యా మీరెవ్వరు నన్నెచటికి గొంపోవుదురు యని భీతస్వాంతమై పలుక,

అప్పుడొక దుర్మార్గుడు కండ్లెర్రజేసి ఛీ పాపీ! నిన్ను యీరోజున కాళికాదేవికి బలిగా నొసంగెదము. లెమ్ము ఆలసించినచో నీ ప్రాణములు దక్కవు అని కేకలిడెను.

ఆమె పాపము వీరి మాటలు విని నోట మాటలేక స్పృహతప్పి క్రింద బడిపోయెను.

కొంతవడికి తెలివితెచ్చుకొని హా రామసింగు మహాశయా! రక్షింపవా యని మొరబెట్టుచుండగా యాక్రూరులు యామెను బలవంతముగా యీడ్చుకొని యామె వెక్కి వెక్కి యేడ్చుచుండగానైన నరకుచేయక గోళికా సదనంబునకు గొంపోయి నిలువబెట్టిరి.

వెనుక హంతక చక్రవర్తియగు పిశాచ బలగనాయకుడు పోవుచుండెను.

... ... ... ... ... ...

ఒక స్త్రీ మేలిముసుంగు వైచుకొని తొందరగా, యడుగు లిడుచు చావడిలోనుంచి రహస్యాగారమువైపు వచ్చుచుండెను. ఆమె యెవరు మన యిందిరయే.

ఆమె యట్లు పోయి రహస్యాగారములోనికి వెళ్లి నిలచెను. అదివరకు దాగియుండిన దుర్మార్గురాలు సుశీల తటాలున యామెపైబడి క్రిందకు బడవైచెను.

పాప యిందిర సుకుమారిగదా! యేమిచేయుగలదు. అట్లె యిరువురును చాలసేపు ఘోరముగా పోరాడంగిరి.

సుశీల చాల బలవంతురాలగుటచే యిందిరను మరల క్రింద బడవైచి యామెను త్రొక్కిబట్టి మొలలోనున్న కైజారుతీసి యామె గుండెలకు సూటిగా బెట్టి

ఛీ పాపీ! ఇందిరా! నీ కపటవేషమున మా రాజును వంచింప నెంచితివా? వసంతను బలిగా నొనరించుటకు సిద్ధులమైతిమి. యేమను కొనుచుంటివో? నిన్నిప్పుడు దీనితో పొడిచివేసెదనని పొడువబోయెను.

తటాలున వెనుకనుండి యిరువురు వ్యక్తులు యామె చేయి బట్టుకొనిరి. సుశీల వెనుదిరిగి జూచెను.

ఆహా వ్యక్తులెవరు? మన పత్తేదారులగు రామసింగు కేశవరావులు.

వారిరువురు యా రాక్షసిని ఓసీ క్రూరురాలా సుశీలా! నిన్నిప్పుడు యేమిజేసెదమో చూడుమని వారు యామెచే నున్న కైజారును లాగుకొని యామెను కొరడాతో నాలుగు మోది బంధించి వొకమూల బడవైచిరి.

ఇందిర వీరలను చూడగనే సంతోష పరిస్వాంత యయ్యెను. తరువాత ముగ్గురును బయటకు వచ్చిరి.

ఇందిరా! సంగతియంతయు తెలిసినది. మన మిప్పుడు కాళి కాలయము కడకు పోవలయును. వసంతను రక్షించి యా సైన్యమును చెండాడవలెను. కావున నీవు సుశీలయొక్క దుస్తులు ధరించుకొని రావలయునని రామసింగు జెప్పెను.

అంతట యిందిర సుశీలకడకు బోయి బలవంతముగా నామె దుస్తులను లాగుకొని తాను ధరించి, తన దుస్తులామె కొసంగి తాను యెప్పటియట్లు వారికడకు వచ్చి నిలువబడెను.

ఇందిర రాగానే వారు మువ్వురును కాళీకాలయము కడకు బోయిరి.

ఈ యిందిరను జూచి యక్కడ నున్న వా రందరు సుశీల వచ్చుచున్నదని భావించి భేరీ భాంకార ధ్వనులు మ్రోగించుచుండిరి.

వీ రందరి నడుమను మన సుకుమారియగు వసంత శిరోజములు వ్రేలాడుచుండ, కన్నీరు ధారగా యేడ్చుచు, యా కాళికాదేవికి యెదురుగా నిలువబడియుండెను.

ఆమె కిరువైపులను తలారులు తళతళలాడు ఖడ్గములు చేత ధరించి నిలువబడియుండిరి.

రామసింగు కేశవులు యీ చిత్రము నంతయు కన్నులారగాంచి యింక నాలస్యము జేసినచో వసంత మనకు దక్కనేరదని తలంచి వాని జేబునుండి యీలను దీసి వూదెను.

వీరిచేత యిదివరకే రక్షకభటాధి కార్లతో మరుగున నిలువబడి యున్న మాధవ, జనార్దనరావులు పెద్ద పటాలముతో బయటకు వచ్చి రివాల్వరు గుండ్లను హంతకులపై గురిపెట్టి కాల్చదొడంగిరి.

ఈ చప్పుడునకు నాశ్చర్యపడి హంతకుని సైన్యమంతయు వీరిపై బడిరి. ఇరు తెగలవారికిని పోరు ఘోరమయ్యెను. రక్షకభటాధికార్లు రివాల్వరులతో హంతకులను కాల్చదొడంగిరి.

ఆ సమయమున రామసింగు కేశవులు యడ్డువచ్చుచున్నవారిని గాల్చివేయుచు, తలారులకడకు వెళ్లి యిరువురు వొక్కమారు క్రింద బడునట్లుగా రివాల్వరుగుండ్లను ఢాంఢాం మని వ్రేల్చిరి. వసంత వీరివైపు జూచి, యానందభాష్పములు రాల్చెను.

హంతకుల సైన్యమంతయు చిందరవందర యయ్యెను. ఒక్కొ క్కొ రక్షకభటుడు యొక్కొక్క హంతకునిబట్టి బంధించుచుండెను. మాధవరావు జనార్దనులు పటాలముల నడిపించుచుండిరి.

కాళికాలయమువద్ద తిన్నెపై యాసీనుడైయున్న పిశాచబలగ నాయకుడు యంతయు జూచి యెంతముప్పు వాటిల్లినది యని చింతించి యొరనుండి ఖడ్గము తటాలున మూడ బెరికెను.

వెనుకనుండి రామసింగు కేశవులు హరిణకిశోరముల భంగి హంతకునిపై బడిరి.

కేశవుడు హంతకునికడనున్న ఖడ్గమును లాగివేసెను. రామ సింగు వానిని క్రింద బడవైచి తన కాలితో నొక్క తావు తన్నెను. మరల లేవబోవుచుండగా కేశవరావు రివాల్వరును గాలిలో రెండు మార్లు ప్రేల్చెను.

తుదకు హంతకు లందరు పట్టుబడిరి. రామసింగు యొక గుర్రపు బండిపై వసంతా యిందిరలను పంపివేసెను.

ఇక హంతకుల నందరిని బంధించి నరసింహేంద్రపుర కర్మా గారమునకు తీసుకొని రాబడిరి.

## ౧౪
## ముగింపు

ఒకనాడు నరసింహేంద్రపుర జనులందరు యాతృతతో కర్మాగారము వైపుకు వచ్చుచుండిరి.

వారిలో వారు యీనాడు హంతకుల వాఙ్మూలములు విన వలయును. గజదొంగ పట్టుబడినాడు. అని వింతగా జెప్పుకొనుచు నడచుచుండిరి.

కర్మాగారములో యంతయు జన సమూహముతో నిండి పోయెను. అచ్చట నొక సోఫాపై మేజస్ట్రేటు యాసీనుడై యుండెను. ప్రక్కను కుర్చీలపై రామసింగు ప్రభృతులు యాసీనులైరి.

ఎదుట నిందితు లందరును నిలువబడిరి. రక్షక భటాధికారులు విపరీత చేతస్కులై యా హంతకు డేమి జెప్పునోయని నిరీక్షించు చుండిరి.

మిగిలిన జన సమూహము ప్రక్క ప్రక్కలనుండి చిందర వందరగా లోన ప్రవేశించుచుండిరి.

ఆ గందరగోళములో రామసింగు కుర్చీపైనుండి లేచి నోటు బుక్కు జూచి ఓరీ వీరదాసూ! నీ వికకు రమ్మ యని కేకవెట్టెను.

వీర :—అయ్యా యేమి సెలవు.

రామ :—ఓరీ! నీవు జనార్దనరావింట దాసిని హత్య జేసినావా ఆమె నీకు చుట్టమేనా?

వీర :—అయ్యా ఆమె నాకు సోదరి. ఆమెను చంపుమని ము-యున్న నాకు యాజ్ఞయిచ్చెను. అందువలన ఘోరముగా నామెను ఖూనీ జేసితిని.

మేజ :—ఓరీ పాపీ వీరదాసూ! నీకు రెండేళ్లు కఠినశిక్ష విధించితిని పొమ్ము.

రామ :—ఓరీ సింహాబలా! నీవు కడు బలాఢ్యుడవే నీ విటకు రమ్ము.

అనినతోడనే సింహాబలుడు వచ్చి నిలచెను.

సింహా :—అయ్యా నేను కడు పాపాత్ముడను ఈ పాపులవలన నేనునుగూడ చెడిపోతిని. నే జేసిన నేరములు తక్కువ. కావన నాకు మీరేమి విధించిన నది యనుభవింతును. నన్నేమియు మీరు బాధించకుడు.

మేజ :—ఓరీ సింహాబలుడా! నీవు యారుమాసములు కఠినశిక్ష యనుభవింపుము.

రామ :—ఓరీ వీరసింగూ నీ విటకురమ్ము.

వీర :—అయ్యా వచ్చితిని.

రామ :—ఓరీ! యలనాడు గోపీచందును చిత్రవధజేసి రక్షక భటుని నోట గుడ్డలు కుక్కినది నీవేనా?

వీర :—అయ్యా నేనును జగత్సింగును కలసి.

రామ :—నా కడకు శవపేటికను పంపినది యెవరు?

వీర :—ఆపని నేను చేయలేదు. ఆ పేటికను పంపినవాడు జగత్సింగు.

మేజ :—ఓరీ అట్లయినచో నీవు నాలుగు సంవత్సరములు కఠినశిక్ష యనుభవింప దగుదువు,

రామ :—ఓరీ భయంకర మానవపిశాచ బిరుదాంకితుడవగు హంతక నాయకుడా! యిటురమ్ము. నీ వార్తలన్నియు నే నడుగకయే జెప్పవలెను.

హంతకుడు :—ఓ రక్షకభటాధికారులారా! నేను కడు పాపాత్ముడను గోపీచందు కూతురగు వసంతను యపహరించి యామె ననేక కష్టముల పాలొనర్చిన హంతకుడను

అనేక కుటిలమార్గముల ద్రొక్కి యనేకుల నా చేతులార ఖడ్గముల పాలొనర్చి తుదకు నా చెలియలినిగూడ చంపుకొన్న పాపాత్ముడను

కాన నేనిక జీవించిన లాభములేదు. నావంటి దేశద్రోహిని యధముని, పరస్త్రీ బలాత్కారాత హరణుని, క్రూరుని ముక్కముక్కల క్రింద నరకినను పాపములేదు. నేనింక బ్రతికి యేమి ప్రయోజనము— వసుంధరాదేవికి బరువుగదే—

అనుచు యందరు జూచుచుండగనే తటాలున మొలనుండి కైజారు నూడబెరికి దానితో నొక్కపోటు పొడుచుకొని రక్తము వరదలైపార క్రింద బడిపోయెను.

సకల జనులున్నూ భీతచకితులైరి. రామసింగు మేజస్ట్రేటు మొదలగువారు నెవ్వెరపడిరి.

సుశీలయు భర్తృమరణమువిలోకించి రివాల్వరుతో యటాత్తుగా కాల్చుకొని చనిపోయెను. అందరును యాశ్చర్య నిమగ్నులైరి.

మేజస్ట్రేటు కేశవ, రామసింగులను గౌరవించెను. అందరును యెవరిదారిని వారు వెడలిపోయిరి.

మేజస్ట్రేటు మిగిలిన దుర్మార్గులకు తగిన శిక్షలు విధించెను. అంతటితో పిశాచజ్వాలలు చల్లారినవి.

... ... ... ... ... ...

రామసింగు కేశవులు దొరతనమువారిచే యెక్కుడు వేతనములు పొంది గౌరవముగా కాలక్షేపము జేయదొడంగిరి.

రామసింగు వసంతను, కేశవరావు యిందిరను పరిణయమాడి ప్రేమతరంగ డోలికల నుయ్యేల లూగుచు మహా సంతోషముగా కాలము గడుపుచుండిరి.

స ం పూ ర్ణ ము.



శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమహేంద్రవరము.

# తమ్మారావు అండ సన్సువారి

## స్వంత ప్రచురణములు

| స్టేజి నాటకములు | |  | సాదా నాటకములు | |
|---|---|---|---|---|
| అహల్య | 1-8 | | సత్యహరిశ్చంద్ర | 1-0 |
| భక్తత్యాగయ్య | 1-8 | | సంగీత కాంతామతి | 1-0 |
| భక్తపోతన | 1-8 | | రోషనార | 1-0 |
| మైరావణ | 1-8 | | పాదుకా పట్టాభిషేకం | 1-0 |
| దీవార్ | 1-8 | | లంకాదహనము | 1-0 |
| తాన్‌సేన్ | 1-8 | | పద్మవ్యూహము | 1-0 |
| ప్రచండభీమకవి | 1-8 | | శ్రీకృష్ణలీలలు | 1-0 |
| చరణదాస్ | 1-8 | | శ్రీకృష్ణరాయబారం | 1-0 |
| మహారాజ్ శివాజీ | 1-8 | | శ్రీకృష్ణతులాభారం | 1-0 |
| భార్యలసమ్మె (నాటిక) | 1-0 | | కనకతార | 1-0 |
| సత్రనశాల | 1-0 | | సారంగధర | 1-0 |
| వీరతానాజీ | 1-4 | | లవకుశ | 1-0 |
| మీరాబాయి | 1-4 | | భక్తకుచేలు | 1-0 |
| మిళ్ళీపెళ్ళి | 1-4 | | రాధాకృష్ణ | 1-0 |
| బాలనాగమ్మ | 1-4 | | అనసూయ | 1-0 |
| కాడ్డీ | 1-4 | | బొబ్బిలి | 1-0 |
| ప్రహ్లాద | 1-0 | | చింతామణి | 1-0 |
| పాండవాజ్ఞాతవాసము | 1-0 | | శశిరేఖ | 1-0 |
| సంగీత సావిత్రి | 1-0 | | ద్రౌపతి | 1-0 |
| జయంతి జయపాల | 1-0 | | ప్రమీల | 1-0 |

ప్రాప్తిస్థానము

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్.**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో :: రాజమహేంద్రవరం.

# తమ్మారావు అండ్ సన్సువారి

## స్వంత ప్రచురణములు

### —: అపరాధ పరిశోధక నవలలు :—

| | | | |
|---|---|---|---|
| మాధురి | 1—0—0 | దండధరుడు | 1—0—0 |
| మోహిని | 1—0—0 | చండశాసని | 1—0—0 |
| ఎడ్డీపోలో | 1—0—0 | పాతాళగృహము | 1—0—0 |
| దివిటీదొంగలు | 1—0—0 | వింత పెండ్లి | 1—0—0 |
| మగపిశాచం | 1—0—0 | ఖూనీపై ఖూనీ | 1—0—0 |

### —: చరిత్రాత్మక నవలలు :—

| | | | |
|---|---|---|---|
| రుద్రమదేవి | 1—8—0 | సుగస | 1 8—0 |
| చాందసుల్తానా | 1—8—0 | సాహసిక | 1—0—0 |
| అమరవిజయం | 1—8—0 | వినువీధి (ఖండకావ్యం) | 1—0—0 |

### —: సాంఘిక నవలలు :—

| | | | |
|---|---|---|---|
| స్వామి (మావారు) | 1—0—0 | అనుపమాదేవి | 1—0—0 |
| బడీబహాన్ | 0—12—0 | గరీబ్ | 1—0—0 |
| చంద్రనాధ్ | 1—8—0 | భిక్షుకి | 1—0—0 |
| దత్తా (విజయ) | 2—0—0 | ఫాదర్ యింటికా | 1—0—0 |
| నాగమ్మ | 1—0—0 | మగవా యింటిదిగా | 1—0—0 |




—: ప్రాప్తిస్థానము :—

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో. : : రాజమహేంద్రవరము.



Magapisacham
1 Rupee.

Rajeswari Press
Rajahmundry. 1951.